"1910వ సంవత్సరము - హాలీస్ కామెట్ వచ్చినప్పుడు....ఆ ధూమకేతువును దక్షిణ హిందూదేశమున ప్రజాసామాన్యమున తొలుత గుర్తించినవాడను నేనగుటలో మహత్తరమయిన విశేషమేదో ఉండబోలునని నేనిటీవల విశ్వసించుచున్నాను. అందుకే దీని గూర్చి యించుకంత హెచ్చుగా వ్రాసితిని. తత్ప్రయోజన మేదో ముందు తెలియగలదు."

(ప్రజ్ఞాప్రభా. పు. 10)

*　　*

"నన్నున్ వర్ణన సేయగా వలవదన్నా కన్నయ్యందాఁక మీఁ
దన్నీవర్ణన మెందు కందులకుఁ గొందాఁకన్ ప్రతీక్షింపుమం
చు న్నన్గూర్చిన యుష్మదాజ్ఞకు నెదుర్చాపై గృహద్వారమం
దున్నాఁడన్ గనరాఁగదే కనుట కర్షున్నన్నుఁ జేయంగదే."

(వే. ప్ర.)

*　　*

'నేనందరకు శిష్యుడను. నేను గురువును గాను. నేనెవరినీ శిష్యులను జేర్చలేదు. నన్నెవరైనా మాష్టరు అంటే దుఃఖపడుదును.'

(వే. ప్ర. 28. 7. 40. చూ. పు. 8.)

మణిమంజరి
వాఙ్మయ యోగ పరిశోధన సంచిక

# ప్రజ్ఞాప్రభ

సంపుటం : 11 ఫిబ్రవరి, 1986

## ప్రజ్ఞాప్రభ - యోగప్రభ యోగవిశేష సంచికలు



**వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్**
2-2-18/15/D/1 బాగ్ అంబర్ పేట,
దేశముఖ్ కాలనీ, హైదరాబాదు - 500 013.

"మణిమంజరి"
యోగ విశేషసంచిక
ప్రజ్ఞాప్రభ

విడిప్రతి పదిహేను రూపాయలు

ట్రస్టు సభ్యులందరికి ఉచితము

ప్రకాశకులు :
**వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు**
2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట,
హైదరాబాదు-500013

ముద్రణ
**మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్**
1-1-694/2/ఎ గాంధీనగర్
హైద్రాబాద్ 500 380

# విషయసూచిక

# సంపాదకీయం

భృక్తరహితతారకరాజయోగమార్గ ప్రవర్తకులగు శ్రీ మాస్టర్ సీ.వీ.వీ. గారికి భక్తితో నమస్కరించి శ్రీవారి మీడియమైన పితృపాదులు శ్రీ ప్రభాకరులకు సప్రేమముగా ప్రణమిల్లి యోగ విశేష సంచికగా మణిమంజరి నీయేడు వెలువరించాలనుకొన్నాము. ఆపని ఒక్క సంచికలో సాధ్యంకాదని తోచి 1986 ఫిబ్రవరి–ఆగస్టు జోడు సంచికలను అందుకై వినియోగిస్తూ ఒక్కసారే విడుదల చేస్తున్నాము.

శ్రీ ప్రభాకరుల జీవితవృత్తాన్ని సుసంపన్నంచేసిన మాస్టర్‌గారి అమృత యోగం, వారిపేరున వెలువడే జయంతి (ఫిబ్రవరి), వర్ధంతి (ఆగస్టు) సంచికలు రెండింటా విస్తరించి సంపూర్ణంగా నెఱవుకొనడమే వీటిలోని విశేషము.

ఈ అమృతయోగవృత్తంలో వృత్తపరిధిని తాకే వ్యాసరేఖకు కొసలు ఫిబ్రవరి–ఆగస్టు మాసాలైతే దాని కేంద్ర బిందువు మే మాసమవుతుంది. అసలు ఈ నవ్యయోగం ఒక నూతన ప్రయోగంగా 1910లో ఆరంభమైనది మే మాసం లోనే. ఈ అమృతయోగావిర్భావానికి దోహదంచేస్తూ విశ్వగర్భకుహరం నుండి ఆవృత్తి ప్రకారం ఆ యేడు ఫిబ్రవరి–ఆగస్టు మాసాల నడుమ భూమి దిశ కవతరించిన హేలీ ధూమకేతువు పృథ్వికి, మాస్టర్ భౌతికానికి, దివ్యస్పర్శ కలిగించింది కూడా మేమాసంలోనే. ఆ యేడు ధూమకేతువు ఆగమనంతో సిద్ధించిన అమృతయోగ మాహాత్మ్యాన్ని అర్చించే మణిమంజరి జోడుసంచికలు ప్రజ్ఞాప్రభ–యోగప్రభ, 1986 ఫిబ్రవరి–ఆగస్టు మాసాలను కలుపుకొని వెలువడడంలోని మరొక విశేషం పూర్వపు హేలీ ధూమకేతువు యొక్క పునరాగమనం కూడా ఈయేడే ఆ నడుమనే కావడం! అంతేకాదు. హేలీ ధూమకేతువు ఈ యేడు విశ్వకుహరంలో విస్తరించి, పెరిగి జోడు దివ్వెలై విహాయసవీథిలో

అపూర్వంగా వెలుగొందిన విషయం మనం చూచినదే. తదుపరి ఆరంభించిన మా యీ మణిమంజరి కూడా ఈ యేడు యోగవిషయాన్ని గ్రహించి జోడు సంచికలుగా వెలువడడమూ తత్ప్రితీకమే.

సృష్ట్యాదిలో మన సౌరమండలంలో ఈ భూమి మీద జరుగుతున్న జీవ పరిణామక్రమానికి విత్తుచల్లినదికూడా ఇట్టిధూమకేతువే అన్న విశ్వాసం నేటి శాస్త్రజ్ఞులకు కలుగుతున్నది. ఈజీవపరిణామక్రమంలో అతీతకాయకల్పసిద్ధికి,దివ్య మానవావతరణకు, ప్రాతిపదిక యేర్పడినది 1910లో తిరిగివచ్చిన హేలీ ధూమ కేతువు కారణంగానే అన్న విశ్వాసం మాస్టర్ యోగానుయాయుల కున్నది. ఈ యోగానికి కామెటుకి ఉన్న నిబిడ సంబంధాన్ని మాస్టర్ గారి యోగజీవితం విశదం చేస్తున్నది.

ఈ యోగం సిద్ధినిపొందే సమయంలో లోకానికి విడ్డూర మనిపించే విధంగా కాక శాస్త్రవిరుద్ధంగా సాగేదిగానే ఉంటుందనీ, మాస్టర్ ఆదేశాన్ని శిరసావహించి యోగసాధన చేయడమే సాధకుల కృత్యమనీ, మాస్టర్‌ని గూర్చిన సంపూర్ణావగాహన లేనిదే ప్రచారానికి ఆవశ్యకత లేదనీ, మాస్టర్స్ వ్యూ వర్కౌట్ అయే సమయం ఆసన్నమైనప్పుడు అదే తనను తాను వెల్లడించుకోగలదనీ తమ గురుదేవులు(మాస్టర్) చెప్పినట్లు పితృపాదులు చెప్పేవారు. ఆతీరుననే గుర్వాజ్ఞను పాటించి సాధనలో అనుభూతిని పొందుతూ మాస్టర్ నామ గ్రహణమాత్రంచేతనే తోడి మిత్రులకు మాస్టర్ యోగానుభూతులను ప్రత్యక్షంగా అందిస్తూ కారుణ్యం చూపినారే కాని బహుకాలం ఎట్టి ప్రచారానికి వారు సమ్మతించలేదు.

శాస్త్రాన్వేషణము, యోగసాధనము ఫలించి, మానవాళి ఎదురు చూచే ఏకైక లక్ష్యాన్ని చేరుకొని, అందరూ సత్యాన్ని గుర్తించే శుభసమయం అనతి కాలంలోనే ఆసన్న మవుతున్నదని ఎప్పటికప్పుడే అనిపిస్తున్నది. నవ్యయోగ ప్రయోగానికి నాంది జరిగింది. మెర్రీలైఫ్ ఇరా ఆరంభమైనది. సాధన జరుగు తున్నది. ప్రోగ్రాంలోని మార్పుల వలన ఇంచుక విలంబమైనా **There Is no failure to this line** అన్న మాస్టర్ వాక్యమే ప్రమాణము.

పితృపాదుల షష్ఠిపూర్తి తరువాత సాగిన ప్రజ్ఞాప్రభాకర రచనము, ఆ పిదప కలుగుతున్న సాధకుల అనుభూతులు, మాస్టర్ నోట్స్ ప్రకటనము, కుంభకోణకేంద్రం యోగమిత్రమండలి సమిష్ఠి వాంఛతో తిరిగీ సాధకులకు విడిది కావడం, మొన్న జులై మాసంలో బెర్క్లీ (కేలిఫోర్నియా)లో జరిగిన శాస్త్రజ్ఞుల సమావేశంలోని సమాలోచన విధానము– ఇవన్నీ అద్యతన భావిలో మానవాళికి కలుగనున్న మేళ్లకు నిర్దిష్ట సూచనలని భావిస్తున్నాము.

''*We are only learning the first things about life, and because we have no idea how to prolong it that does not mean that its indefenite prolongation is impossible*''(29–6–1960లో నా జిజ్ఞాసా పూర్వకమైన లేఖకు సమాధానంగా *Prof. J.B.S. Haldane* వ్రాసిన లేఖాంశమిది అన్నారు ప్రొఫెసర్ హాల్డేన్. ప్రపంచ శాస్త్రజ్ఞులీనాడు (బెర్క్లీ సమావేశం) ''*The universe is in the business of making life*'' అన్న విశ్వాసంతో రేడియో ఏంటెన్నాల మూలంగా రోదసిలో *Extra terrestrial intelligence* (*E.T.I*) కోసం బహిర్ముఖంగా అన్వేషిస్తున్నారు. మాస్టర్‌గారు 1910లో నూతన యోగ ప్రక్రియతో ట్రాన్స్ మీడియం ద్వారా *M.T.A* నుంచి దివ్యసంకేతాలను పొందారు. గ్రహాలకు సంకేతాలను పంపి సమాధానాలందుకొని, మీడియములచేత కోర్సులను చేయించి, ప్రాతిపదిక నేర్పరచి, సాధనకు అనుభూతికి అవకాశం కలిగించారు. ఈ సాధనానుభూతి మాస్టర్ యోగసాధకులలో దినదినాభివృద్ధి చెందుతుండడం ప్రత్యక్షమే. మాస్టర్స్‌వ్యూకి ప్రత్యక్షానుభూతియే ప్రమాణము కాని అన్యము కాదు. మాస్టర్స్ ఉపదేశమే స్వతఃప్రమాణము. ఇతరము కాదు.

''అనంత శాస్త్రం బహు వేదితవ్యమ్– ఆయా శాస్త్రములును తత్కర్తలును బహుభేదములవారు. అందెవరిది గ్రాహ్యమో తేల్చవలసినది మరల నాత్మోద్భోధమే.... బహిర్ముఖముగా లభించు విజ్ఞానమును దోడు చేసికొని యాత్మోద్భోధముల నందుకొన గల్గినచో పరమార్థముల సులువుగా బడయ వీలుపడును.

ఈ యోగ మట్టి ఆత్మోద్బోధమును గొల్పుటకే'' (ప్రజ్ఞా ప్రభాకరము - ఇందే పు. 31) అన్నారు మాస్టర్ గారు. బహుముఖము బహిర్ముఖము అయిన శాస్త్ర దృష్టికి సమగ్రత యోగసాధన వల్లను అంతరుద్బోధము చేతను సులభ సాధ్య మగును.

ప్రజ్ఞాప్రభ- యోగప్రభ ఈ నవ్యయోగ ప్రయోగమునకు లక్ష్యమైన సిద్ధాంత ప్రతిపాదనమును, జరిపిన ప్రయోగ చర్యను, ఉద్దిష్ట సిద్ధిని సంగ్రహముగా సూచించే విధమున రూపొందినవి. వీనిలో పలువు రీవరకే భిన్న సమయాలలో భిన్న ఆకారాలలో వెల్లడించిన సమాచారం రేఖా సూత్రంగా ఒక క్రమాన క్రోడీకరించే యత్నం చేయబడినది. మా దృష్టికి వచ్చినవి, పితృపాదుల యోగా ఫైలులో నున్నవి, యోగమిత్రుల సహకారమున అందుకొన్నవి, లేఖలు- మొదలైన వాటినుండి గ్రహించినవి అనేకాంశము లిందులో యోగ జిజ్ఞాసువుల పరిశీలనకు, సూచనకు అనువుగా పొందుపరిచే యత్నము చేయబడినది. ఈ సందర్భమున మేము గ్రహించిన ఆకరాలను ప్రకటించినవారి సౌజన్యాన్ని పేరు పేరున కృతజ్ఞతతో స్మరిస్తున్నాము.

ప్రజ్ఞాప్రభలో ప్రధానముగా నాలుగు విషయములున్నవి. వానిలో అతి ముఖ్యమైనది ప్రజ్ఞా ప్రభాకరము. మాస్టర్ యోగమును గూర్చి అధికారికముగా అనుభూతి పూర్వకముగా శ్రీ ప్రభాకరులు కూర్చిన యోగ విజ్ఞాన సర్వస్వ సంగ్రహమది. రెండవది యోగమిత్రులు, శ్రీ *NRBV* శిష్యులు అయిన శ్రీ టి.యస్. రామానుజంగారు 1940లో అతీతకాయకల్పసిద్ధి అను పేరుతో మాస్టర్ యోగమును గూర్చి వ్రాసిన కరపత్రము. పునర్ముద్రణమున మార్పదగిన వాక్యములున్నను అట్లు సేయక యథాతథముగ దానినట్లే జిజ్ఞాసువుల యుపయోగార్థము ముద్రించినాము. మూడవది ఈ సంచికకు ప్రాణభూతమైనది, శ్రీ మాస్టర్‌గారి పర్సనల్ లెక్చర్లు,డైరీలు,నోట్సు నుండి గ్రహించిన విషయము- శ్రీ ప్రభాకరుల ప్రియశిష్యులు యోగ మిత్రులు అయిన శ్రీ ఎ.వి. శ్రీనివాసాచార్యులుగారిటీవల (1985–86) ప్రకటించుచున్న సంపుటములనుండి స్వీకరించి

నది. మాస్టర్ నవ్యయోగ ప్రయోగ ప్రారంభ వికాసములను క్షణక్షణ వివరణ ముతో విశదీకరించుచున్న ఈ నోట్సు నేటి దనుక గుప్తముగ నున్నది. ఇప్పుడు వారి ప్రేరణమున వెల్లడియైనది అగుచున్నది దాని ఉనికిని, మహత్త్వమును, పూర్వాపర సందర్భములను విశదీకరించు మీడియముల, యోగ మిత్రుల, ప్రవే శికా పరిచయ వాక్యములతోపాటు ఒక కొన్ని అంశముల నిందు ముద్రించినాము. అర్హులు ఆసక్తిగలవారు ఆయా విషయము లెరుగుటకు మూలగ్రంథమును చూడ దగుదురు. నాల్గవ యంశము మీడియముల ఉపయోగార్థము ఆనాళ్లలో ప్రత్యే కముగా ముద్రింపబడు చుండిన యోగాస్కూలు డైరీలలో (1918) ఒక దాని నుండి సేకరించిన అచ్చులోని విషయము. ఈ డైరీ మీడియమైన డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రిగారిది. ఈ డైరీలో వారానాడు వ్రాసుకొన్న యోగవిష యములు, కోర్సుల సంగతులు ఉన్నవి. దీనిని వారు దయతో మా కొసగినారు. ఇందులో యోగాస్కూలు నియమావళి, ఆదర్శము, అప్పటికి చేరిన కొందరు మీడి యముల సమాచారము అచ్చుపడి ఉన్నవి.

యోగ విశేషాంకముగా వెలువడుచున్న మణిమంజరి జోడుసంచికలలో జిజ్ఞాసువుల ఉపయోగార్థము ఇట్టి అంశముల నుద్ధరించి ముద్రించుటలో సమాచార మందించి తోడు పడిన యోగ మిత్రుల సౌజన్యమును శ్లాఘించు చున్నాము.

సంపాదకుడు

**వేటూరి ఆనందమూర్తి**







# Another Landmark in Golden Era

History was made in Andhra Pradesh again when a new Government was formed un.'er the Chief Ministership of Sri N.T. Rama Rao in January 1983. Under his sagacious and dynamic leadership, the State Government has been striving for the revival of the past glory and allround development of the State with emphasis on the economic upliftment of the poorer and weaker sections of the society. Some of the notable schemes in this direction are :

| | | |
|---|---|---|
| ** | Families benefited under the "Telugu Annapurna Sakshatkara" scheme- Rice at Rs.. 2 per kg. | 108.10 Lakhs |
| ** | Families benefited by the schemes of subsidized distribution of sarees and dhoties under the "Telugu Vastrapradana Vidhanam." | 31.62 Lakhs |
| ** | Houses built for the homeless rural poor under the "Telugu Grihasraya Padham. | 2.82 Lakhs |

| | | |
|---|---|---|
| ** | House-sities distributed to the poor families. | 9.10 Lakhs |
| ** | Oldage pensions to the agricultural labourers under the "Telugu Vyvasaya Karmika saadara Samkshemam". | 4.24 Lakhs |
| ** | Elementary School Children benefiting under the health care scheme of "Telugu Chiranjivula Sukheebhavam". | 6.00 Lakhs |
| ** | Poor agricultural women who receive financial aid at the advanced stage of pregnancy under the "Telugu Maathrudevatha Samadaram Padhakam". | 3.30 Lakhs |
| ** | Land distributed to the landless poor under the "Telugu Maagana Samaradhanam". | 3,000 Acres |
| ** | Prestigeous industries coming up like the Nagarjuna Fertilisers, Godavary Fertilisers, Colour T.V. Tube Factory, Pollution Control Instrument Project etc. aiding rapid Industrialisation of the State. | |

Andhra Pradesh Information



"శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మహాతపోనిధి. మత, దేశ, జాతి కృత వైవిధ్యములు వీడిన మహానుభావుడు. సత్యదయోపకారసార్థకమగు ఆత్మచింతన పథమ్మును తప్పిచరింపని యోగి. గురుచరణ యుగళమును శరణమని నమ్మి జీవించిన యోగదీక్షితుడు ఈశ్వర తత్త్వ చింతనా లౌల్యమునం జెలంగు సకలంకుడు. సచ్చిదర్థ సాకల్యముకొఱకే జననమందిన పుణ్యశ్లోకుడు....

....శ్రీ శాస్త్రిగారి సతీమణి మహాలక్ష్మిగారు అన్నపూర్ణకు నుద్దియైన సాధ్వి. ఆ ఇల్లాలు కూడ కుంభకోణమున భృక్తరహిత తారక రాజయోగమున ఇన్సియేషన్ పొందిరి. యోగశిష్యులను సంతాన సదృశముగా, మాతృవాత్సల్యముతో చూచెడివారు. నేను 1952లో వ్యాధిగ్రస్తుడనై వారున్నచోటికి (ముక్త్యాల) పోగా, ఆ తల్లి యోగశక్తి ద్వారా చికిత్సచేసి నన్ను రోగవిముక్తుని గావించినది. నా ఆరోగ్యలాభమునుగూర్చి తర్వాతకూడ తెలిసికొనుచుండువారు. ఆర్తులందరి యెడ వారి యాదర మట్టిదే. శ్రీశాస్త్రిగారివలెనే వారును నలుబది యేండ్లు పైబడి యోగసాధన మొనర్చిరి. యోగశిష్యులందరు వారిని 'అమ్మగా'రనియే పిలుపు. శ్రీ ప్రభాకరుల సర్వనిర్వాహకములలోను ఆమె భాగస్వామిని. ఆ యమ్మ 1966లో పరమపదించినది."

డా॥ పోచిరాజు శేషగిరిరావు

(*Ph.D.* సిద్ధాంత వ్యాసము–'వేటూరివారి సారస్వత పరివస్య' నుండి)



Late Sri K. VENKATESWARA RAO

## OBITUARY

Sri Kotta Venkateswara Rao M.A., LL.B., eminent lawyer scholar and critic, died of heart attack on 25-2-1986, leaving behind wife, three sons and three daughters. He was 74. He hails from a well known agricultural family of Sangam Jagarlamoodi, Tenali Taluq.

Born on 12-2-1913 Sri Rao had his education at Guntur, Masulipatam and Lucknow. He was called at the Bar in 1938, but soon left it at the call of Gandhiji's National movement. Introduced by Sri Unnava Lakshminarayana Pantulu garu he came under the influence of his spiritual mentor Sri Veturi Prabhakara Sastri garu and practised Bhrikta Rahita Taraka Raja yoga. He was in close touch with eminent personalities like Unnava, Veturi, Viswanatha, Gopichand, Sistla Umamaheswara Rao, Prof. Vissa Appa Rao, Prof. K. Satchidanandamurti and others. He was the founder President of "Seva Sahiti" an organisation committed to the cause of promoting Literary awareness, Scientific knowledge and Loving service for humanity. His deep interest in the Vishnu cult of the Alvar saints lead him to the scholarly exposition of the life and works of the great emperor Sri Krishna Devaraya which awaits publication.

His interest and involvement in the activities of the VPSM Trust are immense and inspiring. Sri Rao's personality is well projected in his scholarly introduction to "Pragna Prabhakaram", the autobiography of his spiritual mentor.

Veturi Prabhakara Sastri Memorial Trust pays its Tributes and conveys its heart felt condolences to the bereaved family of the late Sri Kotta Venkateswara Rao garu.

[illegible]

[illegible]

H.P.B. [illegible]

1 (A) (G) 7

2 (B) (F) 6

3 (C) (E) 5

(D) 4

1, 2, 3 } [illegible]

4 – [illegible]

5, 6, 7 } [illegible]

**PORTION WHICH TREATS ABOUT THE PEDIGREE OF MAN**

*SPIRIT*–పురుష ; *MATTER*–ప్రకృతి

N P B's Key

| | | |
|---|---|---|
| 1 | DIAGRAM | 7 |
| 2 | | 6 |
| 3 | | 5 |
| | 4 | |

1, 2 & 3 – DOWNWARDS
4 – COMBATING STAGE
5, 6 & 7 – UPWARDS

THE SPIRIT WHICH COMES OUT AFTER CONQUERING MATTER IS CALLED TRIPLE THAT WHICH HAS 3 QUALITIES IS TRIPLE OR THRI MOORTHI.

[ఈవిషయంగల పైది బ్లాకు శ్రీ మాస్టర్‌గారి దస్తూరీతో నున్న నోట్సులోని ఒక పుట నుండి గ్రహించినది. దీనికి సంబంధించిన ఆంగ్లవిషయం మాకడనున్న యోగా ఫైల్‌లోని 16 పుటల వివరణాత్మక సంపుటం నుండి యెత్తి వ్రాసినది. సచిత్రంగా సవివరణంగా నున్న ఈ సంపుటం యోగ అనుభూతులను విశదీకరిస్తున్నది. అందలి 15, 16 పుటలుకూడా ఇంచే *xvi* పుటలో ముద్రింపబడినవి.–సం.]

-15-

Back View




In a man-form there are 7 planes.

1 Physical - K is in the centre of this plane.
2 Astral - Navel " "
3 Mental - Stomach " "
4 Buddhic - Heart " "
5 Nirvanic - Neck " "
6 P N - Middle of eyebrows "
7 M P N. - Top Head " "

IL = Inner Lotus; PB = Petuitary body; PG = Pineal gland; S = Sahasrara; H = Hithu; I = Ida; P = Pingala; S = Sushumna; K = Kundalini.

-16-

Flow from the Astral System.




The physical man-form consists of 3 bodies. Physical, Etheric, and Astral. All these three interpenetrate one another.

An activity coming from the Astral system is first received by the Astral body which in its turn distributes to the Etheric which again distributes to the Physical.

*C. V. V.*

నమస్కారము

# ప్రజ్ఞాప్రభాకరము

— శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

శ్రీ నిరంతరానందనిశ్రేయసార్థ
సాధకము, సర్వకిల్బిషబాధకము, స
మగ్రవిజ్ఞానదము, మహామహిమఘనము
శరణ మగు మాకు సద్గురుచరణయుగము.

## ఉపక్రమము

సత్యజ్ఞానానందాత్మకమగు పరతత్త్వము తత్ప్రతికూలగతితో అవివేక జీర్ణారణ్యమున జిక్కి చీకాకు పడుచున్న యనదను నన్ను త్రోవకు దెచ్చి కాపాడిన తీరును మిత్రగోష్ఠిలో విన్నవించుకొనుటకొఱకే నా యీ గ్రంథ రచన ప్రయత్నము. దీని రచనమున నాకు పురుషోత్తముఁడగు గాంధి స్వచరిత్ర రచనా విధానము దారిదివ్వె. గులాబి మొగ్గను గడుపునఁ బెట్టుకొని దాని గ్రమ్ముకొని కఱకు నూగు తొడిమ త్రేకే తొలుత గానవచ్చినట్టుగా ఉపక్రమమున నిందు ప్రభాకరనామకుఁడ నగు నేనే కానవత్తును గాని, నాలోని దివ్య తత్త్వపుఁ బూవు వికాసము చెందిన పిదప, నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వెలార్చుఁ

జొచ్చిన పిదప, దాని గొని యానందింపఁ గోరువారికి నేను తత్ప్రదర్శకుడను గానే, యంగుళిగ్రాహ్య మగు తొడిమనుగానే యడుగునఁ బడి యుండి కానవత్తును. అప్పు డిది ప్రజ్ఞా చరిత్రమే కాని ప్రభాకర చరిత్రము గాదు. ప్రభాకర చరిత్ర మయినను ఆ ప్రభాకరుడు తొల్లింటి నేను గాక వేఱొకఁడే.

పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుం
దరము పదార్థయుక్త మగుతత్త్వమునే వెలయింపఁగావలెన్,
గురుచరణారవిందములకుం బ్రణమిల్లెద నట్టి నేర్మికై.

## జననాదికము

సర్వజిన్మాఘ బహుళైకాదశీ మంగళవారమున ఉదయాది 19 గడియలకు జ్యేష్ఠాచతుర్థ చరణమున—క్రీ. 1888 ఫిబ్రవరి 7 వ తేదిని—కృష్ణాతీరమున పెద కళ్ళేపల్లి గ్రామమున నేను జన్మించితిని. నా జాతకచక్రము జన్మకాల ఘటికాది వివేచనతో నా బాల్యమున మా నాయనగారు వ్రాసియుంచినది కలదు గాని—నేను దాని నెల్ల నిం దుదాహరింపవల దనుకొంటిని. జోస్యులకు దాని పరిశీలనపు టలజడి వలదని నా కోరిక.

మా యూరు పూర్వము వేదశాస్త్రాది విద్యావిదులగు విప్రులతో సర్వ వర్ణములవారితో విలసిల్లినది. నా పసితనమునాఁటికిఁ గూడ వేద శాస్త్ర సాహిత్య విశారదు లనేకులు మా గ్రామమం దుండిరి. శ్రీవత్స గోత్రు లగు వెలనాటి వైదిక బ్రాహ్మణుల వంశము నాది. శేషమ్మ మా తల్లిగారి పేరు. సుందరశాస్త్రి మా తండ్రిగారి పేరు. ఆ పుణ్యదంపతులకు నలువురు పుత్రులు, నలువురు కుమార్తెలును కలిగిరి. నేఁటికిని సోదరులము నల్వురము సుఖముగా నున్నాము. నాకు అక్కగారు అన్నగారు నిద్దఱగ్రజులు, తర్వాతివా రవరజులు. మా తల్లి పరమసాధ్వి.

మా తండ్రిగారు కొంత కొంతగా స్మార్త వైదిక జ్యౌతిష శిల్ప సంస్కృత సాహిత్యముల నేర్చినవారు. ఆంధ్రమున మంచి సాహిత్యమును కొంచెము కవితా

పరిజ్ఞానమును గలవారు. వైద్య విద్యా విశారదులు. పారంపర్యముగా పురోహితత జీవిక యయినను మా తండ్రిగారు ప్రధానజీవిక వైద్యముగా వర్ధిల్లిరి. మా తల్లి దండ్రులు పరస్పరము ప్రేమమయులు. వివాహమయిన తర్వాత వారెన్నడు భిన్న స్థలములలో నెక్కువ నాళ్లు వసించి యెఱుగరట !

దంపతులు గాఢానురక్తులగుచో, సత్సంకల్పులగుచో, రసభావానందమయు లగుచో తత్సంతానము చిరంజీవిత్వాది గుణగణ్యమై వెలయఁగల దని ఇటీవలి నా గట్టి యెఱుక. ఇందు కెన్నో తార్కాణ లెఱుగుదును.

మా తల్లిదండ్రుల ప్రగాఢానురాగము తత్సంతానమగు మాకింతదాఁక క్షేమారోగ్యాదికము ప్రసాదించినదని నా విశ్వాసము. మా తండ్రిగా రెనుబది మూఁడేండ్లు నిరామయ దీర్ఘ జీవితము గడపిరి. వారి తండ్రిగారును నెనుబది మూఁడేండ్లు జీవించిరి. మా తాతగా రవసానకాలమున.కుమారుని బిలిచి "నాయనా! నీవును నావలె నెనుబదిమూడేండ్లు జీవించగల"వని మా తండ్రిగారి నాశీర్వదించి రట! పలుమారులు మా నాయనగా రీ యాశీర్వాదమును జెప్పుకొనుచుండెడివారు. వారి యాశీర్వాదము మా తండ్రిగారియెడ ఫలించినది ! మా తల్లిదండ్రులు సంప న్నులు కారు గాని సంపన్నులకంటె సుఖముగా జీవిక గడపినవారు. పుత్ర పౌత్రాదులతో మా యూర మా యిల్లు దోసతోటవలె నుండెడిది. మా యింట మానాయనగారు నూటింటిదాక జన్మోత్సవములు వారి కాలమున జరిపినట్లు లెక్కించుచుండెడివారు.

## బాల్యస్మృతులు

మా యింటి దగ్గఱనే సాలెవీథిలో సాలెవారు వారి గురువగు భావనఋషికి ఉత్సవము జరుపుచుండిరి. నా వయస్సప్పటికి ఎనిమిదో తొమ్మిదో ఉండును. సంజవేళ 7, 8 గంటలప్పుడు భోజనము చేసి అక్కడ జరుగుచున్న యుత్సవ మును జూచుట కేగి యట్టట్టే నేను మైమఱచి నేల వ్రాలి పోయితిని· అక్కడివారు మైమరుపాటు కలుగుచుండుట నా వల్ల విని న న్నింటికి గొనివచ్చిరి కాబోలును ! ఎంత సేపయినదో ! మా తండ్రిగారు దగ్గఱ శివకవచము పారాయణ చేయు చుండగా మెలకువ వచ్చెను. నా కేమియు బాధ గోచరింపలేదు. అంతే. అటుపై సాధారణముగా జాతర్లకు, దేవోత్సవములకు నే నంతగా వెళ్ళ నుత్సహింప కుండుటే జరుగుచు వచ్చినది. పై సంవత్సరమున నాకు మైమఱుపా టేల కలిగెనో

అప్పు డెవ్వరికిని నెఱుక కందలేదు. పెక్కేండ్లకుఁ దర్వాత నాకే అది తెలియ వచ్చినది. అర్హసందర్భమున దాని చెప్పుదును.

పదేండ్లవయసు రాక ముందే యిట్టిది మఱొక సంఘటన! మా యూర కలరా తీవ్రముగా వ్యాపించినది. ఊరిలో నీ దుర్వ్యాధి వ్యాప్తికి చింతించుచు గుమిగూడి సంభాషించు పలువురలో నేఁడు మాటాడినవారే రేపు దాని వాతఁబడుట, మరణించుట జరుగసాగెను. గ్రామస్థు లెన్నెన్నో తంటాలు పడిరి. గ్రామదేవత లకు ఇతర దేవతలకు మ్రొక్కుకొనిరి. వ్యాధి కొన్నాళ్ళకు తగ్గిపోయినది. తగ్గిన వెంటనే పెద్దయెత్తున నాయాదేవతలకు జాతరలు సాగించిరి. ఆ దేవతల యాకృ తులు, వారిని గూర్చిన పంబవారికథలు, జంతుబలులు నాకు చాల రోతను భీతిని గొల్పసాగినవి. దేవత లిట్టివారా! ఈ అర్చన లేమిటి! అని నేను పలుక సాగగా చుట్టుప్రక్కలవారు దేవతలు నాపై కోపగింతు రని ఊరికి చెఱుపు చేయుదురని మాటాడకు మని నాపై కోపగింపసాగిరి. ఆ జాతర తుదినాడు కొర్లంక యను పేరి దేవత కొకబండి గట్టి దానిమీఁద గసి గలలో పందిపిల్లల నైదింటిని గ్రుచ్చి అవి గిజగిజ కొట్టుకొనుచు మరణయాతన మనుభవించుచుండగా నూరేగించి యూరి బయట ఆయాదేవతల కంపకములు చేసిరి.

నాఁటి దుర్దర్శనము నేఁటికి కనుల గట్టినట్లు గానవచ్చుచున్నది. ఊరి వారు జాతర సరిగా సాగె నని సంతసింపసాగిరి. గొప్ప సంక్షోభముతో నేను దుఃఖింపసాగితిని. మరణమును గూర్చి, మరణానంతర స్థితినిగూర్చి, పుట్టుకను గూర్చి, పుట్టుకకు పూర్వస్థితిని గూర్చి, దేవతలను గూర్చి నిరంతర చింత నాకు రేగెను. పెద్దల నడుగజాల నైతిని. తోడి వయసువారికి నా గోడు తెలుపుట వ్యర్థ మయ్యెను. వీని యాథార్థ్యము తెలియవలెనని రాత్రులందు భగవంతునికి మ్రొక్కి కనులు మూసికొని సమాధానము ప్రతీక్షింపసాగితిని. కనులు మూసికొని చూడ సాగగా చిమ చిమ చిమ్మ చీకటి నన్ను చుట్టుముట్టి మహాసముద్రమువలె గోచరింప సాగెను. దాని మధ్యభాగమున నే నున్నట్టు తెలియును. అనంతముగా నన్ను చుట్టు ముట్టి యున్నట్టి యా యంధకారము పొడుగుగా నున్నదా, చతురస్రముగా నున్నదా అని కూడ జూడ దొడగితిని. అది యేదో గోళాకారముగా నున్నట్టు తోచును. దాని నడుమ 'నేను ఉన్నాను, ఉన్నా' నన్న ప్రజ్ఞ మాత్రము మినుకు మినుకు మనుచు గజిబిజి పాటుతో దోచుచుండెను. ఎన్ని రాత్రులలో యిట్లు నిద్ర

పట్టునంతదాక చూచుచునే యుంటిని. ఒకటే యంధకారము. భయంకరమయిన యీ యంధకారములో నే నున్నానన్న యెఱుక, మెలకువ మాత్రము ధైర్య చ్ఛాయను గొల్పసాగినది. అట్లు కనులు మూసికొని బైటకు జూచుచున్నట్లు చూచుటే కాని యప్పుడు నా దేహములోనికి జూచుకొనుట యన్నది నే నెఱుగను? అట్లు చూడలేదు. బైటి యంధకార గోళమున నుండి నా ప్రశ్న లకు సమాధానములు దొరకలేదు నేను చచ్చిపోయితిని. తర్వాత! అనుకొనెడి వాడను. అప్పు డీ చీకటిలో నేను లేను అని తోచెడిది. బ్రతికి ఉన్నాను అనుకొనెడి వాడను. ధైర్యము తోచి మినుకు మినుకు మనుచు అణుమాత్రుడను ఉన్నాను— అని తోచెడిది. ఎంత తంటాలు పడినను ఇంతే. ఒకనాడు నాలో చర్చ. ఎందుకు పుట్టితిని ? చచ్చితిని గనుక. ఎందుకు చచ్చితిని? పుట్టితిని గనుక. చచ్చితిని సరే— మరల పుట్టకుండరాదా? పుట్టితిని సరే—చావకుండరాదా ? తోచదు. ఇట్టు మనో మథనము జరగగా చివరికి తేల్చుకొన్నాను. నా పుట్టుక నే నెఱుగను. నా చావును నే నెఱుగను. అంతా చీకటే. ఇప్పు డేదో నేను ఇట్టు మినుకు మినుకు మనుచు న్నాను. ఇది ఆరిపోతే ఏమవుతుందో తెలియలేదు. వెల్తురెక్కడున్నది? నే నున్నా నని మినుకు మినుకు మను అణుమాత్రపు వెల్తురే యున్నది. ఇది ప్రజ్వరిల్లరాదా? ఈ చింత హెచ్చయినది. జాతరలమీఁద రోత మఱీ హెచ్చినది.

ఆ కాలముననే అప్పటికి నాకు పదేండ్ల వయసుండునో, ఉండదో మాయూర శివరాత్ర్యుత్సవము గొప్పగా సాగును. మా చుట్టుపట్టుల యూళ్ళ కెల్ల మాయూరు గొప్పశివ క్షేత్రము. అక్కడ నాగేశ్వరస్వామి యని శివలింగమున్నది. అమరావతివలె నదియు ప్రాచీన శివక్షేత్రము. ఎంత ప్రాచీన మయినను నది బౌద్ధమత వినాశ చిహ్నముగా వెలసినదేయని నా నమ్మకము. అక్కడ శివలింగ మొక బౌద్ధస్తూపశిలయే యని యిటీవలి నా నిశ్చయము. అక్కడి దేవాలయమున అర్థ ధర్మచక్రములు గల బౌద్ధస్తూప శిలలున్నవి. కంటకసేల(గంటసాల)స్తూప విధ్వంసనానంతర మక్కడి స్తూపశిలలు చుట్టుపట్టుల దేవాలయ నిర్మాణముల కుపకరించినవి. గంటసాలస్తూపపు సూచీశిల యొకటి మంగి యువరాజు శాసన శిలగా మారినది. క్రీ.శ. 6,7 శతాబ్దములకే బౌద్ధస్తూపములు గొన్నియైనను విధ్వంసము చెందినవనదగును. మా యూరి శివలింగము జనమేజయ సర్పయాగ

స్థానమందు అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, మహానాగకుమారుల చేత సుప్రతిష్ఠిత దివ్యలింగమని పదుమూఁడవ శతాబ్దినాఁటి శాసనమున్నది.

ఒక శివరాత్రినాఁడు – జగజ్జ్యోతి వెలిగించువేళకుఁ జాల ముందుగానే నే నక్కడకు జేరితిని. కొన్ని మణుగుల నేతికుండులో గొప్ప జ్యోతి వెలిగించిరి. నేను తిరిగి వచ్చుటలో గోపుర ద్వారమున జనసమ్మర్దములో నలిగి పోయి క్రింద పడితిని. నామీఁది నుండియే జనము నన్ను చింపిరిగుడ్డను దొర్లించుకొనుచు నడిచి నట్లు నడవఁజొచ్చిరి. చచ్చితి ననుకొంటిని. ఊపిరాడదు. ఎట్లో నన్ను కాళ్ళతోనే దొర్లించుచు గోపుర ద్వారము వెలికిపో పడదన్నిరి. బయటకు వచ్చిన తర్వాత నెమ్మదిగా ఒంటరిపట్టుకు దొరలి చాలసేపు విశ్రాంతి గొన్నపై చక్కఁబడితిని. నాటినుండి గుళ్ళు గోపురములు జాతరలు నాకు దూరమయినవి.

ఇంచుమించుగా నా పదియేండ్ల ప్రాయముననే నాకడగొట్టుసోదరికిఁ జాల జబ్బు చేసినది జీవితము నిలువదేమోయని యందఱు సందేహించు స్థితి కలిగెను. తర్వాతస్థితి యెట్లుండునో యని మాకు చల్దియన్నము వడివడిగాఁ బెట్టిరి. మాతో వావిడిచి చెప్పకున్నను ఇంటిలోని యలజడిని గుర్తించి నేను బెంగతో నెవ్వరికిని గానరాకుండ గుడిలోని కరిగి యక్కడ నొకమూలలో రక్షించు మని యాబిడ్డను గూర్చి భగవంతునిగూర్చి యేమేమో ధ్యానింపఁజొచ్చితిని. ఇంటికి మధ్యాహ్నపుఁ దిండికి రాలేదు. ఇంటిలో అలజడి కొంత తగ్గినది. రెండు మూఁడు విరేచనములయి బిడ్డ తేటగా నున్నది. అపాయభయము తొలఁగినది. అందఱును భోజనము చేసి నేను గానరాకపోవుట గుర్తించి వెదకసాగిరి. మిత్రులిండ్లలో నెక్కడను నేనుగానరా లేదు. ప్రొద్దు క్రుంకువేళ కావచ్చినది. మా నాయనగారికి వెఱపు కల్గినది. వెదకఁగా వెదకఁగా తుదికి గుడిలో నక్కియున్న నన్ను గనుగొని బిడ్డ క్షేమ మెఱిఁగించి చాల దుఃఖించి నన్నింటికిఁ గొనివచ్చిరి. పసితనము నాఁటినుండియు వ్యాధికి మృతికి నేను తార్మారయి పోయెడి వాఁడను. ఏమియు తోచక చేయఁ గల్గినది లేక ఇంట నిలుకలేక ఎవ్వరును గుర్తింపఁజాల రని గుడిలో నొక మూల నక్కి నాఁడు నేను దైవప్రార్థనము చేసితినే కాని దానికి ఫలితముండు నని యా నాఁడు నే నెఱుఁగను.

మా నాయనగారు వైద్యవృత్తిలో రోగులకడ కటువుగా సొమ్ము పుచ్చుకొనుచుండిరి. ఒక సందర్భమున వ్యాధితుని యార్తికి జకితుఁడ నయిన నేను మా నాయనగారిని సొమ్మునకై నిర్బంధింపక మందీయఁగోరితిని. 'ముందు వ్యాధికుదుర్చఁడు. వానిచేత సొమ్మిప్పుడు లేదు. నెమ్మదిగా ఇయ్యఁగలఁడు. ఇయ్యకపోయినఁ బోనిండు. మీకు పుణ్యము దక్కు' నంటిని. రెండు నిమిషము లాలోచించి 'నాయనా! ఈ కాఠిన్యము మీ మీఁది ప్రేమచేతనే నేను పూనవలసెను. నే నిట్టి కాఠిన్యము పూనకున్న సొమ్ము రాదు. అది యార్జించినఁ గాని మీ పోషణము సాగదు. మీమీఁది ప్రేమ నన్నితరులమీఁద నింత కఠినునిఁ గావించినది' అనిరి. కనుల నీరు గ్రుక్కుకొని యూరకుంటిని. ఆ సంభాషణము నాలో మఱపురాక కుదుర్కొని నాఁటినుండి నన్ను వేధింపఁజొచ్చినది. దాని నిర్వాహము ముందు తెలియఁగలదు.

## అనుభూతి - తద్వికాసము

ఏదో సందర్భములో నా పసి (అయిదు ఎనిమిది సంవత్సరముల నడిమి) వయస్సుననే ఆంజనేయుని దేవళమున బ్రాహ్మణ సంతర్పణము జరుగుచున్నది. నేను నున్నాను. బీటలు వాసి శిథిలముగా నున్న గుడి తలుపుసందున నుండి యెవరో తొంగిచూచిరి. ఆరగించనున్న లోనివా రది గుర్తించి గద్దించిరి. బైటి మనిషి వైదొలగెను. మే మందఱము భుజించి వెలికివచ్చితిమి. సాధు వొకఁ డాకొని యక్కడుండెను. 'నీవే కదా తొంగిచూచిన'దని భుక్తానులిప్తులగు మావా రడిగిరి, 'అగునండి! లోని సందడి విని గుడి కదా! లోని కలకలమేమో అని చూచితిని. భుజించుట చూచితిని. మీరు గద్దించితిరి. మీ భోజనానంతర మాకొన్న వానికి నాకింత యన్నము పెట్టుదు రేమో అని కూర్చుంటిని' అనెను. 'బ్రాహ్మణ సంతర్పణము చెడగొట్టితివిరా దుర్మార్గుఁడా' యని మా వారు చెడదిట్టిరి. 'అయ్యా! మీరింత యన్నము పెట్టిన నా కడుపు నిండునుగాని మీ భోజనము చూచినంత మాత్రమున నాకేమి యొలుకునండీ! లోన భుజించుట యెఱుఁగక చూచితిని' అనెను. 'ఇంకా భుజింపవలసిన బ్రాహ్మణు లున్నారు. అంతా ముగిసేదాకా నీకు పెట్ట వీలులేదు, పో! తొలగిపొ'మ్మని ఒక మొనగాడు బ్రాహ్మణుఁ డుదరము నులుముకొనుచుఁ దిట్టెను. మిట్టమధ్యాహ్నము పన్నెండు గంటలవేళ! ఆ సాధువు కన్నీరు కార్చుచు ఆకసముకేసిచూచి తలవాల్చి కేలుదోయి సూర్యభగవానునికి

మోడ్చి 'తండ్రీ! నే నేపాపము నెఱుఁగను. నన్ను వీరు తిట్టుచున్నారు. సర్వ సాక్షివి! చూచుచున్నావు! కనికరించు మో దేవా!' అని చేతి కుండికలోని నీటితో బిక్క మొగము కడుగుకొని యక్కడనుండి వెడలిపోయెను. ఆ సాధు వట్లు సూర్యునికి మ్రొక్కుచు మండుటెండలో మాడుచు నాడినపలుకులు నా గుండెలలో వేడిగా నాఁటుకొనెను. ఒడలు జలదరించెను. ఇంటికి వెళ్లినప్పటికి తీవ్రజ్వరము వచ్చెను. మూఁడునాళ్లు చాల బాధపడితిని. ఆ బ్రాహ్మణుని ధౌర్త్యము, ఆ సాధువు జాలిమాటలు నాలో నా మూఁడు నాళ్లు నెంతో గందర గోళము గల్గించినవి. మా తలిదండ్రుల కీగొడవ నేను తెలుపలేదు. క్రమక్రమముగా నా జ్వరము తగ్గినది. ఆ మూఁడునాళ్ళ శరీరకంపములో నాలో నెంతో లోతున నేదో భావము పాతుకొని పోయినది. ఈ సంభవము మాత్రము నాకు పలుతూరులు స్మృతిపథమున మెలగు చునే యుండినది. కాని అది లోఁ బాదుకొనిపోయి నాలోనుండి వెడలించిన వివేక జ్వాలలను మాత్రము నేనిటీవలనే — ఈ విషయము వ్రాయుచున్నప్పుడే — స్పష్టముగా నిరూఢముగా నెఱుఁగ గల్గితిని.

భూమిలోఁ బడవేసిన విత్తనము కొంతదాఁక ఏమయినదియుఁ దెలియరాక యుండి యుచితకాలమున నంకుర రూపముగా బహిర్వికాసము చెందినట్లు మానవ హృదయములలోఁ జొచ్చు కొనిపోయిన యనుభూతులు కూడ నుచిత కాలమున వానికిఁ దగినట్లు పాకముతో వెల్వడి విరివినెందును. కాని యివి బీజరూపముగా నెన్నడో లోనికిఁ జొచ్చుకొని పోయిన యా యనుభూతులవల్ల నేర్పడినవే యని గుర్తించుట మాత్రము సర్వత్ర జరుగదు. లోతయిన సంస్కారములు కొన్ని కాల మెంతో గడచి యనుకూలసందర్భము సమకూడినప్పుడు గాని కార్య పరిణామము నెందఁజాలవు ఆ చెందిన కార్యపరిణామమునాఁటికి కారణజ్ఞప్తి మఱుగుపడి పోవుట సంభవింపవచ్చును. ఈ బీజరూప సంస్కారములు లో నొచ్చుటయుఁ దర్వాత నవి బహిర్వికాసము నెందుటయు నొక్కజన్మములోనే జరగు ననఁగాదు. పూర్వక్షణపు బీజ రూపసంస్కార ముత్తరక్షణముననే బహి ర్వికాసము చెందునది గాఁ గొన్ని సందర్భములం దుండవచ్చును, కొన్ని సంద ర్భములం దేడుజన్మముల దాఁకఁగూడఁ దేలనివి గావచ్చును. భగవత్ప్రాప్త్యర్థమైన సంకల్పబీజములు భగవత్తత్త్వమును గూర్చి స్పష్టపరిజ్ఞానము కుదురుదాఁక విరివి నెందుచుఁ బెరిగి పెరిగి ప్రారబ్ధము పొందిన పిదప నక్కడనుండి బహిర్వికాసము

నకు వచ్చుచుఁ బరిపూర్ణతను జెందుటకుఁ గూడ నట్లే యేడు జన్మములదాఁక సాగ వచ్చును.

పరిపూర్ణత చెందు టనఁగా మానవసామాన్యము కంటె నెంతో ఉన్నతోన్నతముగా ఎంతో లోతులోతుగా గోచరించిన తత్త్వమును మానవుఁడు తన ప్రేమ ప్రసరించిన చోట్ల నెల్ల వ్యాప్తపఱుపఁగల్గుట. ఉన్నతోన్నతము, లోతులోతు నయినభావ మదాటుగా అకారణముగా అసాధనముగా గోచరింపదు. తన హృదయ మెంతెంత ప్రేమమయమగునో, ఆ ప్రేమ మానవతమీఁద నెంతెంత యధికాధికముగాఁ బ్రసరించునో మానవుఁ డంతంత ఉన్నతముగా అంతంత లోతుగా పారమ్యమునకుఁ జేరిక చేరికగాఁ బోగల్గును. చెట్లవ్రేళ్ల విరివి సెంది దూరదూరము వ్యాపింపను వ్యాపింపను చెట్టు మీఁదికి పెరుగగల్గును. కూకటి వేరు నేలలోఁతుకును జొరగల్గును గదా!

## ధూమకేతు దర్శనము

మద్రాసులో మా బావగారు శ్రీ రామేశంగారి దగ్గఱ గుమాస్తా శ్రీ కాజా వెంకటశేషయ్యగా రుండిరి. వారి యండతో నేను మద్రాసులో నెలకొంటిని. మద్రాసు చేరగానే నాకు శ్రీపండిత గోపాలాచార్యులుగారు, శ్రీ పురాణం నాగభూషణముగారు మిత్రు లయిరి. గోపాలాచార్యులుగారి ద్వారా నాకు శ్రీ పనప్పాకం అనంతాచార్యులుగారితోను, వారి కుమారులగు శ్రీనివాసాచార్యులుగారితోను మైత్రి యేర్పడెను. మద్రాసుచేరగానే వెస్లి మిషన్ హైస్కూలులో తెలుఁగు పండితుఁడనుగా నేను గుదుర్కొంటిని. రెండేం డక్కడ నుంటిని. ఆ నాళ్ళలో తఱచుగా ప్రాచ్యలిఖిత పుస్తకశాల కరుగుచు నక్కడి గ్రంథములు చదువుచు నుంటిని.

శ్రీ వేపా రామేశముగారితో నేను దఱచుగా విద్యావినోద మనుభవించుచుండువాఁడను. రామేశంగారు విద్యారాశి. గణిత ఖగోళ చరిత్రాదిశాస్త్రములందు నిష్ణాతులు. వారికడ ఖగోళశాస్త్రరహస్యము లెన్నో తెలిసికొనుచుండెడివాఁడను. వారికొక టెలస్కోపు కలదు వారి ధర్మపత్ని యంతర్వత్నిగా నుండి పురుటికై పుట్టినింటికి వెళ్ళుచుండు సందర్భములలో నెలల తరబడి రాత్రులందు వారితో చాలసేపు నక్షత్రగ్రహ మండలములను బరిశీలించుచుండువాఁడను. ఎన్నో ఖగోళ

శాస్త్ర రహస్యములు నా కెఱుఁగఁ జెప్పుచుండువారు. నేర్చుకొనుచుండెడివాఁడను. ఎపిగ్రాఫియా ఇండికా, ఇండియన్ ఆంటిక్వెరీ, ఎపిగ్రాఫికల్ రిపోర్టులు మొదలగు చరిత్రాధార గ్రంథము లెల్ల వారి దగ్గఱఁ గలవు. వాని నెల్లఁ జదువఁ దెచ్చుకొని చదువుచుండువాఁడను.

1910వ సంవత్సరము. హాలిస్‌కామెట్టు వచ్చినప్పుడు — ఇంకా కొన్నాళ్ళకది స్థూలదృష్టికి గోచరించుననఁగా టెలిస్కోపుతోను, బైనాక్యులర్‌తోను తెల్లవారు జామున లేచి ఆకాశ భాగమును మే మిర్వురమును బరిశీలించుచుండువారము. ఆ ధూమకేతువు తొలుత అరుణోదయ మగుచుండగా తూర్పుదిక్కున గోచరించెను. అది యుదయించునంతలో ఉదయారుణకాంతులు క్రమ్ముకొనఁగా కానరాకపోయెడిది. ఒకనాఁడు బైనాక్యులర్ చేతనుంచుకొని మేడ దిగి రోడ్ మీఁదికి పోయి పరిశీలింపఁగా నా కది వెల్తురు చీపురుకట్టవలె గోచరించెను. పర్వెత్తుకొని (అంతలో అరుణద్యుతులు క్రమ్ముకొను నని) రామేశంగారికి చూపవచ్చితిని. ఆ ఆత్రపాటులో మేడమెట్లు కొట్టుకొని మోఁకాలి మీఁద చర్మము చిట్లి నెత్తురు కారుచుండెను. అది చూడక నేను కేతువు కనబడెనని స్పష్టముగా గోచరించుటకు టెలస్‌కోపును సరిద్రిప్పు చుంటిని. నెత్తురు చూచి ఇదేమని రామేశంగా రడిగిరి. అప్పుడు దెబ్బగుర్తించితిని. అంతలోనే టెలస్కోపులో స్పష్టముగా కేతువును గుర్తించితిని. రామేశంగారు నాయుద్వేగమును, రక్తస్రావబాధను గూడ గుర్తింపమిని జూచి నివ్వెఱ చెందిరి. నివ్వెఱ కొంత ఉడిగి టెలస్‌కోపులో కేతువును గుర్తుపట్టుచుండగా వెలుఁగు రేకలు చెలరేగి కానరానియవయ్యెను. మర్నాటి తెల్లవారుజామున నిర్వురము లేచితిమి. జాగ్రత్తగా గుర్తించి నిన్నటి యాకాసపు పట్టు చూపఁగా రామేశముగారు స్పష్టముగా చూచి యప్పుడే దాని గూర్చి హిందూ పత్రికకు వ్రాసిరి. మర్నాడు వారికి కొన్ని టెలిగ్రాములు దాని యెఱుకకై వచ్చినవి. అటుపై నాల్గయిదు రోజులకుఁ గాబోలు నది యందఱ యెఱుకకు నందినది.

ఆ ధూమకేతువును దక్షిణహిందూదేశమున ప్రజాసామాన్యమున తొలుత గుర్తించినవాఁడను నే నగుటలో మహత్తరమయిన విశేషమేదో ఉండ బోలు నని నే నిటీవల విశ్వసించుచున్నాను. అందుకే దీని గూర్చి యించుకంత హెచ్చుగా వ్రాసితిని. తత్ప్రయోజన మేదో ముందు తెలియఁగలదు.

# వివాహము

ఇర్వది రెండవయేట నాకు పెండ్లి జరిగినది. మాయూరికి కాఱుమైళ్ళ దూరమున నున్న గంటసాల నాయత్తవారి యూరు. ఆయూరే నా మేనమామగారి యూరును. తొంబదియేండ్లకు పైబడినవయస్సువారు, మా మేనమామగారు శ్రీ పిసిపాటి వేంకటాద్రిగారిప్పటికి నారోగ్యముతో నున్నారు. వారికి నేడ్గురుపుత్రులే కలిగిరి కాని పుత్రికాసంతానము లేదయ్యెను. మాతోడిసంబంధము తర్వాత లేక పోవు నన్న కొఱఁతతో వారి జ్ఞాతులగు మా మామగారిని నాకు పిల్ల నిమ్మని వారు కోరిరి. వారికుమారుఁ డప్పటికి రెండేండ్లకుముందు స్వర్గస్థుఁ డయినవాఁడు, శ్రీ సోమనాథశాస్త్రిలుగారి కడను, శ్రీ వెంకటశాస్త్రిగారి కడను నాతో సహాధ్యాయుఁడుగా నున్నవాఁడు, వెంకటరామశాస్త్రి జీవించియున్నప్పుడు వారిమీఁది యాదరము వెల్లడించుచుండుటచేతను, మామేనమామగారి కోరికచేతను, భూవసతి లేదన్న కొఱఁతను దలఁచి సందేహించుచున్నను మా సంబంధమున కెట్టకేలకు మామామగా రంగీకరించిరి. వారు ప్రశాంత చిత్తులు, సద్వర్తనులు, అమాయకులు. మా తండ్రిగారివలెనే కడిపెడు బిడ్డలు గలవారు.

వివాహ మయినది. మామాతృశ్రీ గారి మీఁది భక్తిచేతను, వారి పుట్టిన యూరని, వారియింటి పేరివారని నేనెంతో తనివితో నీ సంబంధమును ప్రేమించితిని. వివాహ మయినతోడ్తో మద్రాసు వచ్చి వేసితిని. అప్పుడు నానివాసము మైలాపూరులో. తిరువల్లిక్కేణి హైస్కూలుకు ప్రతిదినము రాకపోకలు. తొమ్మిది గంటలకు హోటలులో భోజనము చేసి తిర్వలిక్కేణికి నడచి వెళ్లి సాయంకాలము తిరిగి నడచి వచ్చి రాత్రి భోజనము చేయుట. దీనిచే నాహారము చాలక కాఁబోలును నీరసముగానే ఉండెడివాడను. నీరసమే తప్ప వ్యాధి యేదియును లేదు. అప్పుడప్పుడు కృష్ణామండలమందలి స్వగ్రామమునకు వెళ్ళి అక్కడ కమ్మని నెయ్యి పెరుగులతోడి భోజనము చేసినప్పుడు శరీరమునకు మంచి బలోత్సాహములు లభించుచుండెడివి! సంవత్సరమున కొకతూరి తప్పకుండ నింటికి వెళ్లుచు నట్టి బలోత్సాహముల నార్జించుకొని వచ్చి వానిని మద్రాసులో వ్యయించుచుండినట్లు తోచుచుండెడిని. ఈ ప్రయోజనమునకై వివాహానంతరము వేసంగిలో నేనింటికి వెళ్ళితిని.

## వేంకటేశ్వరస్వామి దర్శనము

అప్పటి నా జీవితాశలు రెండు. మా తల్లిదండ్రు లెప్పుడో మ్రొక్కు కొన్న శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామిని దర్శించుట యొకటి. నాకు పసితనము నాఁటనుండియు దేవాలయముల కరుగుట గాని, అక్కడ స్వామిదర్శనము లభించు నని నమ్ముట కాని, అక్కడి విగ్రహముల కర్చనాదికము జరపుట కాని యిచ్చ గొల్పని మచ్చట తిరువళిక్కేణిలోగాని మైలాపూరులో గాని దేవళములలోనికి స్వామిదర్శనార్థమై యెన్నఁడు గాని నేనై వెళ్ళి యెఱుఁగను. కాని యప్పుడప్పు డేవో నా మనోభావములను పద్యములతో తిరువళిక్కేణి పార్థసారథిస్వామి స్తుతిగా వెల్లడించుట కలదు. ఇట్టి వానికి నాకు తిరుపతి వేంకటేశ్వర స్వామి దర్శనమున మచ్చట యంత తీవ్రముగా నేల కలిగెనో నాఁడు గుర్తింప గుదుర లేదు. 'కలౌ వేంకటనాయకః' అన్న శ్లోకాంశము నన్ను ప్రకమ్ముకొన్నది.

మే మందఱము మ్రొక్కు చెల్లించుకొనుటకు అనఁగా చిరంజీవి మా తమ్మునికి శంకరున కుపనయనము స్వామి సన్నిధిని చేయుటకు బయలుదేరితిమి. మద్రాసునుండి బయలుదేరి తిరుపతికి వచ్చుటలో నిజముగా నాకు స్వామిసన్నిధికే వచ్చుచున్నంత యుప్పొంగు అఖిలాండనాయకుఁ డగువాని, విశ్వమును విష్ణువును, వషట్కారుని, భూతభవ్యభవత్ప్రభువును కన్నులార కాంతును గదా! ధన్యుఁడ నగుదును గదా! అదుగో ఇదిగో చేరబోవుచున్నాను అని మురియఁ జొచ్చితిని. అప్పుడే తీవ్రానారోగ్య విముక్తుఁడ నయితిని గాన దౌర్బల్యము ప్రబల ముగా నున్నను నీ యుత్సాహము నన్నుద్బోధింపఁగా స్వామిపై నేవో పద్యములు పయనములో రచింపఁదొడఁగితిని. తిరుచానూరిలో నుపనయనము జరపితిమి. స్టేషను నుండి యెండలో నాయూరు చేరుటలో మా యన్నగారి కుమార్తెకు పసి బిడ్డకు తీవ్రజ్వరము వచ్చెను. జ్వరము తగ్గుదాఁక నేనదే చేయుదునని కూర్చుండి పద్యములతో స్వామిస్తుతి చేయఁ జొచ్చితిని. జ్వరము కొన్ని గంటలలో తగ్గి పోయెను. పద్యములు చాల రచించితిని. వానిలో నొకటి రెండు:—

చుఱ్ఱని మేను కాలెఁ గనుచూడ్కి వికారము దోచె నన్నకుం
గుఱ్ఱది యాఱుమాసములతూన యిదెక్కడి వేకిసోకొ మా
మొఱ్ఱల నాలకింపుము నమోనమ ! యప్పన నీకు నప్పనా
చిఱ్ఱున చీదకుండ సుఖసిద్ధికిఁ దార్చుమి బిడ్డఁ దేర్చుమీ!

జ్వరము తగ్గినపై

అంకిలి లేనిభక్తి మనసారఁ దలంచి నమస్కరించి మా
సంకట మార్పవే యన వెసన్ సుఖ మిచ్చి యనుగ్రహించి తో
కింకర కల్పకంబ! పరికించితి నీమహనీయతన్ 'కలౌ
వెంకటనాయకో' యను సువిశ్రుత సూక్తియథార్థభావముఁ.

ఆనందముతో నందఱము గొండ లెక్కితిమి. వృద్ధులుగాన మా నాయనగా రంతకు ముందు పలుతూరులు స్వామిదర్శనము చేసినవారు గాన దిగువతిరుపతిలోనే కొలఁది కాలము క్రిందటనే కట్టిన 'పుష్పతోట' సత్రములో నుండిరి. స్వామి దర్శనమునకై యువ్విళ్ళూరుచు వెళ్ళితిని. కాని యక్కడ నాకెంత తంటాలుపడినను స్వామిమూర్తి దర్శనము లభింపలేదు. మద్రానునుండి మహంతుగారికి, వారిదగ్గఱి నుండి కొండమీఁది యుద్యోగులకు జాబు గొని వెళ్ళితిమి. కాన యక్కడ పలయు సౌకర్యములు లభించెను. మావారందఱు కొంత యలజడి, త్రొక్కటమును జెందినను స్వామిదర్శనము నసిగాఁ జేసికొని తనిసిరి. నేను చాలసేపు స్వామి మూర్తిని చూడ యత్నించి విఫలమనోరథుఁడ నయితిని. ఎంత యత్నించినను చెదరి చీకటి గానవచ్చెను కాని నాకక్కడ స్వామిమూర్తి గోచరింపదయ్యెను. చాల నిరుత్సాహము చెందితిని. దుష్టుఁడ నని దురపిల్లితిని. పాపిష్ఠుఁడ నని పలవించితిని. ఏమియుం దోచఁక యేడ్చితిని. అనారోగ్య దౌర్బల్యముచే నక్కడి మూర్తి దర్శనమునకు కనులు మిఱుమిట్లు గొని యుండు నని, స్వామికి నాకు నడుమ దివ్వెవెలుఁ గుండుటచే నది యడ్డువచ్చి మూర్తిని గానరానీయ దయ్యెనని, నా పాపకర్మముచే దర్శనము లభింప లేదని పరిపరియోచనలు, వాని కేవో యపవాదములు తోఁచసాగెచు. ఏమి తోఁచినను స్వామి గోచరింపఁ డయ్యెనే కదా యన్న యారాటము నన్ను వీడలేదు.

ఈ సందర్భ మీ గ్రంథము రచించునాఁటి కిందుమించుగా నల్వదియేండ్లకు పూర్వము జరిగినది. 1910వ సంవత్సరము నాఁటి దీ వృత్తాంతము. తర్వాత 1930 నుండి తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి కొంత యెఱుక నాకుఁ గలుగసాగెను. 1949 నాఁటికింక నెన్నో విషయములు గోచరించెను. వాని నాయాసందర్భములలో సక్రమముగా వివరింతును.

## వెలుఁగునీడలు

భవభూతి పునరుక్త మయిన యీశావాస్యోపనిషద్వాక్యము "అసుర్యా నామతే లోకాఅంధేన తమసావృతాః, తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనో జనాః" అన్నది యాత్మహత్యా సంకల్పజ్వాలలను జల్లార్చి వేయుచుండెడిది. కడు పసిప్రాయమున కనులు మూసికొని బోరగిల పడుకొని చూచుచుండినపుడు నేను "నే నని" నాలో గోచరించిన మినుకు మినుకు గ్రుడ్డివెలుఁగే దూరమున గోచరించి జీవితాశోచ్ఛ్వాస మాడించుచుండెడిది.

మందులు మానితిని గనుక మావారు మంత్రములకేసి దృష్టి సారించిరి. వారిని వీరిని పిలిపించి మంత్రజపము చేయింప నుద్దేశింపఁగా నేను వారింపఁ జొచ్చితిని. ఆ మంత్ర ప్రయోక్తల యోగ్యతలు నే నెఱిఁగినవే. కనుక వారిని బిలిపింప నొల్లనయితిని. నా యనారోగ్యమును న న్నడిగి విద్వాంసుఁడు గదా యని నేను చెప్పఁగా విని వేద శాస్త్ర విద్యావిశారదుఁ డొకఁడు 'ఏఁబది రూపాయలు తెచ్చుకొని నాకిచ్చితివేని నీకు మోహిని పట్టినది. దానిని తొలఁగింపగలను' ఇత్యాదిగా నేదో చెప్పెను ధిక్కని తెగడితిని. అనుదినము సహస్రగాయత్రీ మంత్రజపము చేయుచు నమాయకుఁడుగా నుండు వృద్ధబ్రాహ్మణు నొకని– ఆయన కుమారుఁడు మాయూర స్కూలుమేష్టరుగా కొన్నాళ్ళుండెను–బిలిపింప నుద్దేశింపఁగా నేను వల్లె యంటిని. వారిని గ్రామాంతరమున నుండి పిలిపించిరి. నలుపది దినములు మంత్రజప మాయన జరపెను. ఆయనవల్ల నా కేమాత్రము మేలు జరుగబోదని నేను బిగ్గ పలుకుచుండెడివాఁడను. వీనికిఁ పట్టిన గ్రహచారమో, గ్రహమో ఉపకారకము లయిన పద్ధతులపై వీనికి విశ్వాసము కుదురనీయకున్నదని మావారు తెగడఁ జొచ్చిరి. "నిజమే! నాకిట్టివారి ప్రజ్ఞమీఁద విశ్వా

సము లేదు. అదే నా జబ్బు అనుచున్నవారు మీరో వారో కదా దానిని గుదుర్ప వలసిన వారు "నాకు విశ్వాసము కొల్పుడు" అనువాడను. నలువది నాళ్ళయిన తర్వాత జపఫలము నాకు ధారాదత్తము చేయుటకు గొప్ప బ్రాహ్మణ సంతర్పణము జరపిరి. వృధా ధన వ్యయ మని నేను వగవఁ జొచ్చితిని. ఇట్టి చీకాకు లెన్నో పడితిని. వేనివల్లగాని నాకు మేలు జరగలేదు. తొట్టెస్నానము, ఉప్పుకారములు లేని భుక్తి ఒకమాదిరిగా చేయుచునే యుంటిని.

మద్రాసులో నా స్థానమున నియుక్తులైన విద్వాంసులు హఠాత్తుగా అంతరించిరి. చలిజ్వరము నూటయాఱు డిగ్రీల పైచిలుకు వచ్చి ఆ తర్వాత ఔషధము నిరుపయోగముకాఁగా పుణ్యలోకముల కరిగిరఁట! మా ఆఫీసు క్యూరేటరు శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు నాకు డి.ఓ. వ్రాసిరి. 'నీవు వచ్చి డ్యూటీలో చేరుట మంచిది. నీకు తొందర కలుగకుండ దేశాటనము చేయ నేర్పాటు చేయుదును. రావలసినది' అని. ఆ వత్సరమున ఆంధ్రసాహిత్య పరిషత్తు సంవత్సరోత్సవము గుంటూర జరగెను. నేను చాల గౌరవించు వేదము వెంకటరాయ శాస్త్రిగారి యాధ్యక్ష్యము. మిత్రులు శ్రీ రామకృష్ణకవిగారు నన్ను మద్రాసు రాఁగోరి జాబు వ్రాసిరి. గుంటూరఁ గలుసుకొందు నని ఇరువురు వ్రాసి యట్లే గుంటూరు వెళ్ళితిని. నేను మాటాడినది, చేసినది ఏమియు లేదు. అయినను ఆ యుపన్యాసము వినికిడికి, ఎండలకు తాళఁజాలక పోయితిని. మిత్రులు కనుపర్తి మార్కండేయశర్మగారియింట విడిసి, తొట్టెస్నానము చేసి కొంత స్వాస్థ్యము కూర్చుకొంటిని

మిత్రుల ప్రోద్బలమున మద్రాసు వెళ్ళ నిశ్చయించుకొంటిని. ఇంటికి వెళ్ళి తగిన యేర్పాట్లతో నే నొక్కఁడనే బయలుదేరితిని. ఆప్తులు, బంధువులు మంగళగిరి నరసింహస్వామి దర్శనము చేసి పొమ్మని నిర్బంధించిరి. భక్తిభరితముగా సంకీర్తనముల పాడఁగల బ్రాహ్మణుఁ డొకఁడు నాతో వచ్చెను. మంగళగిరి వెళ్ళితిమి. అక్కడ బాలాంబగా రను మహనీయురాలు మా కాతిథ్య మిచ్చెను. పానకము మొదలగు నైవేద్యములు చేయించితిమి. పానక మారగింపు చేయించునప్పుడు వెండి కవచములో నున్న మూర్తిలీరును గూర్చి నాకు యోచన. దానిని వెల్లడింపఁగా దైవపరీక్ష వలదని యక్కడివారు నాకు హిత ముపదేశించిరి. స్వామి కేదో చెల్లింపఁ దలఁచుకొంటిని గాని చెల్లింపలేదు. అది శ్రీ బాలాంబ

గారికి సమర్పింపఁ గోరిక. ఈయటోగా నప్పుడామెగారు 'మా యింట నాతిథ్యము గొని మీ రేదో యిప్పుడిచ్చుట పూటకూళ్ళయింట నిచ్చిన ట్లగును. తర్వాత మీరు మీ గంతవ్యస్థలము చేరి యేదేని పంపుదురు గా' కనిరి.

మద్రాసు చేరితిని. ఆఫీసు డ్యూటీలో ప్రవేశించితిని. అప్పుడు మిత్రులు కొంద ఱుండుటచే సముద్రతీరమున బక్కింగ్‌హామ్ లాడ్జిలో నుంటిని. జనార్దన్ అను పుణ్యాత్ముఁడు హోటలు ప్రొప్రైటరు నాకు మిత్రుఁడు. ఆతని హోటలులో భోజనము. డ్యూటిలో ప్రవేశించిన పదిరోజులకే అయిదురోజులు కాషుయల్ లీవు పెట్టితిని. రాత్రులందు నిద్రరాదు. కడుపులో మంట శరీరమున తాపము. తీవ్రమయిన యశాంతి. అప్పుడు నా బాల్యమిత్రము శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు కూడ నాతో నుండిరి. వారి తోడ్పాటుతో డాక్టరు లక్ష్మీపతిగా రింటి కేగితిని. ఆయన సరిగా వ్యాధిని గుర్తించి కాని మందిచ్చువారుకారు. ఎక్కువగా మందులు వాడక ఆహారవిహారాదులచేతనే శక్యమయినంతవఱకు వ్యాధినివారణ చేయఁ జూతురు. ఆయన కూడ నాకు చిర మిత్రము. నా వ్యాధిచరిత్ర మంతయు విని నరముల యుద్రేకము తగ్గుట కేదో మందు (బ్రోమైడు) ఇచ్చిరి. అది పుచ్చుకొనఁగా ఒకరాత్రి నెమ్మదిగా నున్నదిగాని మర్నాడు శరీర మంతయు పట్టు విడిపోయిన ట్లయి లేవలేని స్థితికి వచ్చితిని. ఆ మందు మానివేసితిని.

ఇక నౌకరీ దుష్కర మని నిశ్చయించుకొంటిని. అప్పటికే క్యూరేటరుగా రిఁక సీతఁడు సెలవు కోరినచో డిస్మిస్ చేసి యింటికిఁ బొమ్మనవలసినదే అని రెణ్ణాళ్ళకు ముందటి సెలవు చీటిమీఁద వ్రాసిరి. వా రందాఁక నెంతో యోర్మితో నన్ను నెలకొల్పుకొనఁ జూచిరి. లాభము తోఁప దయ్యెను. నాకును దిక్కు దోఁప దయ్యెను. బలవంతమున శరీరమును, నరముల శక్తిని ఎగసన ద్రోసికొని స్నానముచేసి హోటలుకు వెళ్ళితిని. నేఁటితో నౌకరికి నీళ్ల దోడుకొనవలసినదే! ఇట్టి స్థితితో ఇంటికి మరల వెళ్ళుట బ్రదికియుండియుఁ జచ్చుట యగును. చేత నున్నసొమ్ముతో హరిద్వారమునకు టిక్కెట్టు తీసికొని (టిక్కెట్టుకే చాలినంత ధన మున్నది కాన) మార్గమున నుపవాసమే చేసి ఏ దేని యాహార మెవ్వరి వలన నేని యయాచితముగా లభించిన నారగించి మహాప్రస్థాన కల్పముగాఁ బోయి గంగానదీ ప్రవాహములోఁ గలయుదునుగా కని నిశ్చయించుకొంటిని. ఆత్మహత్య యసుర్య నరక ప్రాపక మన్న చింత రేగెఁ గాని పాండవాదుల మహాప్రస్థానము పాపా

పాదకముగాఁ గాక పాపాపనోదకముగాఁ జెప్పబడుట గోచరించి సమాధి గూర్చెను

క్యూరేటరుగారు డిస్మిస్ చేయునందాఁక నెందుకు ? నేనే రిజిగ్నేషన్ చీటి పంపుదునుగా కని నిర్ణయించుకొని అట్టి చీటి వ్రాసి చేత నుంచుకొంటిని. తొమ్మిదిన్నర గంటలకు భోజనము చేసి నౌకరి చెల్లు చీటిని నాతోపాటు నౌకరిలో చేరినవాఁడు, నా యనారోగ్యమునకు నా కంటె దుఃఖించుచుండువాఁడు నగు గుమాస్తా యింటికి వెళ్ళి యిచ్చివేయ నిశ్చయించుకొంటిని హోటలుకు భోజనమునకు బోగా జనార్దనుఁడు జబ్బుగా నుంటి నని నాకై ప్రత్యేకముగా కారము లేకుండ చాల రుచ్యముగా కూరలు, పచ్చళ్ళు చేయించెను. ఆతఁడు మామూలుగానే చేయించె నేమో కాని నాకు మాత్రము నాఁటి భోజనము కొన్ని యేండ్లకు పూర్వ మెప్పుడయిన చేసియుందునో లేదో అన్నంత రుచ్యముగా నుండెను. కడుపార నారగించితిని. శరీరమున కుత్సాహము తోఁచెను. నరముల బలము చక్కఁబడినట్లయ్యెను. 'నేఁ డాఫీసుకు పోయి పని చేయగల్గుదునా ? జబ్బు కుదురునా ? నేఁ డీ యుత్సాహ మేమి? ఏమో! డ్యూటిలో నుండఁజాలను. హరిద్వారము వెళ్ళవలసినదే! గంగలోఁ గలయుట మాట అక్కడ నిర్ణయించుకొందునుగాక !' ఇత్యాది విధముల యోచనలతో అక్బరు సాహెబు వీధిలో వచ్చుచుంటిని.

## వెలుఁగు బాట

రోడ్డుమీఁద అబ్బూరి జగన్నాథరావుగా రను మిత్రుఁ డగపడి నా చేయి పట్టుకొని 'మీరు ప్రభాకరశాస్త్రిగారేనా ? ఇట్టుంటి రేమి?' అని యడిగెను. మూఁడేళ్ళ నుండి జబ్బుగా నుంటి నంటిని. ఏమిఁ జబ్బు అనుచు నాతఁడు నన్నింటిలోనికిఁ గొనిపోయెను. శూన్యహృదయముతో నేను లోని కరిగితిని. అక్కడ శ్రీ గురజాడ అప్పారావుగారి ద్వారా నాకు మిత్రు లయినవారు, అప్పారావుగారి బంధువు, మూఁడేండ్లకు ముందు అప్పుడప్పుడు నన్ను లైబ్రరీలోని యోగశాస్త్ర గ్రంథముల గూర్చి యడుగుచుండువారు నగు శ్రీ పోతరాజు నరసింహము, ఎం. ఏ , ప్రెసిడెన్సి కాలేజి ఫిలాసఫీ ప్రొఫెసరు అగపడిరి. వారి ప్రశ్నపై సూక్ష్మముగా నా యనారోగ్యము తెల్పితిని వారి బావమఱఁది యగు జగన్నాథరావు నన్ను 'మా బావగారు చేరిన యోగగోష్ఠిలో చేరిన మీ యనారోగ్యము తొలఁగిపోఁగలదు

గదా ! ఏల చేరరాదు ?' అనిరి. నరసింహముగారు 'ధ్రువనాడి' యను గ్రంథము లైబ్రరీలోఁ గలదా యని ప్రశ్నింపసాగిరి. వారు చేరిన యోగగోష్ఠిని గూర్చి, ధ్రువనాడిని గూర్చి నేను వారిని ప్రశ్నించితిని. నా జాతకము ధ్రువ నాడిలో నుండునా యని యడిగితిని. వారు గంపెడు విషయములు చెప్పిరి. నన్ను వెంటనే కుంభకోణము వెళ్ళి యోగగోష్ఠిలో చేరఁగోరిరి. వెళ్ళుటకు సమ్మతించుచో జాబు వ్రాసి యిత్తు ననిరి.

హరిద్వారము గాక ఆరోగ్యద్వారము చేరఁబోవు చున్నట్లయ్యెను. 'నేను' అను నా బాహ్యప్రజ్ఞలో దిరిగినట్లును, దానికి నొకబాట పాయ లిచ్చి యేర్పడు చున్నట్లును దోఁచెను. ఎడమప్రక్కనుండి తేలి తేలి బెడుగు పోవుచున్నట్లును, గుడి ప్రక్కనుండి దూఱి దూఱి గుణ మేదో లోలో కుదుర్కొనుచున్నట్లును, రెండిం టికి నడుమ నొకబాట యరటాకు నీనవలె సాగుచున్నట్లును దలఁపఁజొచ్చితిని. ఒకప్రక్క ఆఫీసుకు వెళ్ళవలసిన తొందర, ఆ సమయమున మా లైబ్రేరియన్‌కు మిత్రుఁడు, మా నరసింహముగారికి మిత్రుఁడు నొక్కఁ డక్కడ నుండి నాగోడెల్ల విని 'రెండురోజులు సెల విప్పించుటకు నేను లైబ్రేరియన్‌తో చెప్పి యేర్పాటుచేసెదను. నీవు కుంభకోణము వెళ్ళుము' అని క్రొత్తగా లీవు చీటి వ్రాయించి పుచ్చుకొని వెళ్ళెను.

నేను సాయంకాలము రైలు పయనమునకు సన్నద్ధుఁడ నయితిని. నరసిం హముగారు జాబు వ్రాసి యిచ్చిరి. రాత్రి ఏడుగంటలకే నేను ఎగ్మోరు స్టేషనుకు వెళ్ళితిని. అక్కడ మా లైబ్రరి యరవపండితుఁ డుండెను. అతఁడు నన్నుఁజూచి చెయి పట్టుకొని 'నేఁడు ఆఫీసుకు రాక అయ్యో ! ఇదియేమి ? ఇక్కడ నగపడితిరి? ఎక్కడికి పోవుట ? మీ యింట చేర్చెదను రండు. మతి స్వాస్థ్యము తప్పి యిట్లగుచుంటిరా యేమి ?' యని పలవించెను. నేను దుఃఖించితిని. అతఁడు నాకడ నంతదాఁక చాల నడకువతో వర్తిల్లుచుండినవాఁడు. దయనీయముగా నున్న నా యప్పటి స్థితికి వగచి యట్లనెను. నేను చెప్పితిని. 'నాకు మనసు చెడలేదు. ఆరోగ్యమునకై వెళ్ళుచున్నాను. రెన్నాళ్ళలో మరల రాఁగలను. కంగారు పడపద్దు. నామీఁది యాదరమే మీచే నిట్లు పలికించినది. ఎఱుఁగుదురు వెఱవవలదు. లైబ్రేరియన్‌తో నే నిట్లు వెళ్ళుచుండుట తెల్పుఁడు' అని. అతఁడు టిక్కెట్టు కొని తెచ్చిపెట్టి రైలెక్కుదాఁక నాతో ముచ్చటించుచుండెను.

# ది వ్య ద ర్శ న ము

రైలు సాగెను. రైలు వేగమును మీఱి నా మనోవేగముండెను. మర్నాడుదయము ఎనిమిదిగంటలకు కుంభకోణము స్టేషనులో దిగితిని. కాలకృత్యములు తీర్చుకొని మంచి మామిడిపండ్లు కొనుకొని నరసింహముగా రిచ్చిన యడ్రెసుకు బండిమీఁద వెడలితిని. బండివాఁ డాయింటిని బాగుగా నెఱిఁగినవాఁడు. త్రోవలో నాతఁడు అక్కడి గురుదేవుల ఘనతను వర్ణింప దొడఁగఁగా తదాకర్ణనోత్సాహముతో నే నంతలోనే చేరవలసినచోటికిఁ జేరితిని.

ఒక సన్న్యాసి కాషాయధారి రోడ్డుమీఁద బండి నిలువగానే చేరవచ్చి నా తెలుఁగుతీరు గుర్తించి 'యెవరు నాయనా నీవు? ఎక్కడనుండి రాక? ఎందుకోసము?' అని తిన్నని తెలుఁగు పలుకుబడితో ప్రశ్నించెను. నన్నాలింగనము చేసికొని బండి దించెను. ఆయన యాదుకొని నన్ను బండి దించినప్పటి పరితోషము నే నెన్నటికి మఱువఁజాలను. నాచేతి పండ్లబుట్ట పుచ్చుకొని వడిగా లోని కరిగి నా విషయములు శ్రీవారి కెఱింగించి నన్ను దర్శనమునకుఁ దోడ్కొని పోయెను.

లావు గాక సన్నము గాక, పొట్టి గాక మఱీ పొడుగు గాక నిమ్మపంటి ఛాయతో అరుణోదయ కాంతులు కడలొల్కుచున్న శ్రీవారిని జూడ గానే నా యొడలు పులకరించెను. కేలుదోయి మోడ్చి నమస్కరించి జాబు నర్పించుకొంటిని. చదివి, నవ్వి 'స్నానాదికము గావించి విశ్రాంతి గొను' మనిరి.

నాకు శ్రీవారిదర్శనము చేయించిన ఆస్వాములవారు నన్ను స్వజనముగా నాఁడే కాక వారు జీవించియున్నంత దాఁక ప్రేమించుచుండిరి. వారిపేరు సచ్చిదానందేంద్రసరస్వతీస్వామి. అప్పటికిఁ గొన్నేండ్లకు ముందు వారు బందరులో సన్న్యసించిరి. బ్రహ్మణ్యులు జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు వారి కుద్యోగము నుండి పెన్‌షన్ ఇప్పించి యాశ్రయ మిప్పించిరఁట! ఆ కారణమున వారికి కృష్ణామండలమువా రన్న నధి కాదరము. వారిజన్మదేశము కాంచీమండలము తెలుఁగు బ్రాహ్మణులు. సన్న్యాసానంతరము వారు మహనీయులని ప్రఖ్యాతిగన్న స్వాములవార్లను గొందఱను వెన్నడించి విసుగు గొని శాంతి లేక తిరుగాడుచు

శ్రీవారిమహనీయతను విని వారికడకు వచ్చి ఆజీవితము అక్కడనే నెలకొని పోయిరి. శ్రీకృష్ణునకు సాత్యకివోలె వారు శ్రీవారికి సదానువర్తనులై యుండిరి.

నే నప్పటికి తొట్టిస్నానము సరిగా చేయకున్నను కారము లేని, తిరుగబోత లేని కూరలతోనే భోజనము చేయుచుంటిని. శ్రీవారితో నాస్థితిని విన్నవింపఁగా 'ఇఁక నీయారోగ్య రక్షణభారము నేను వహించితిని. వెఱవక నలువురితో పాటుగా మామూలు భోజనము చేయవచ్చును. దానివల్ల నీకేమి చెఱుపు రాదు' అనిరి. ఆవాల తెట్టె తేలుచున్న చారుతో, నూనె తిరుగబోత కూరలతో నే నానాఁడు భోజనము చేసితిని. అంతకుముందట్టి భోజనము చేసినచో కడుపులో మంట. నిద్రరాదు. అశాంతి అధిక మయ్యెడిది. స్వాములవారు కంటిని రెప్పవలె నన్నుఁ గాచియుండి నాయనారోగ్యాది విషయములు విచారింపసాగిరి. అన్నియుఁ జెప్పితిని. మర్నాటి రాత్రివఱకే నే నక్కడ నుండ వీలగుట తెల్పితిని.

## ఉపదేశము

*నాటిసాయంకాలము ఆఱుగంటలకు నాకు శ్రీవారి శిష్యతానుగ్రహము లభించెను. శిష్యతానుగ్రహము పడయుటకు సమకూర్చుకోవలసిన వాని నన్నింటిని స్వాములవారి తోడ్పాటుతో సమకూర్చుకొంటిని. ఉపదేశ విధాన మెల్ల స్వాములవారు సూచించిరి. శ్రీవారికి సాష్టాంగముగా నమస్కరించి నాయభ్యర్థనము నివేదించుకొంటిని. ఉపదేశము చేసిరి. వెంటనే 'నీవు హాలులోనికి వెళ్ళి ప్రేతాసనమున శయనించి, నమస్కరించి, ఉపదిష్టము నొక్కమారే యుచ్చరించి, కనులు మూసికొని, శరీరము లోతట్టున నేమేని జరుగును గనుక దానిని గుర్తించుచుండుము. మనస్సు బహిర్ముఖమై యెక్కడికేని పోయినచో పోనిమ్ము. నీవై యరికట్టవలదు. అదే తిరిగి రాఁగలదు. ఏమి జరుగునో సాక్షిమాత్రుఁడవై పరికింపఁదలపు గొనుము. అంతే నీవు చేయవలసినది. కొన్ని నిమిషములదాఁక కనులు తెఱవ ప్రయత్నింపకుము. ప్రయత్నించినను దెఱవ వీలుపడదు. మరల మూసికొనియే పోవును. శరీరములో నప్పుడు జరగవలసిన దెల్ల జరగగానే కన్నులు తెఱపి యగును. అటుపై కనులు మూసికొని పండుకొనుట కష్టమని

* యోగములో చేరిన తేది 22-6-1916. మీడియము సంఖ్య 380.

పించును. అందాక కనులు తెఱవను, లేవను కష్ట మనిపించును' అని స్వాముల వారు దగ్గఱనుండి తెలియఁజెప్పిరి. అట్లే ఉపదిష్టము నొక్కమారే సార్థకముగా స్మరించి యుచ్చరించి కనులు మూసికొని పండుకొంటిని.

## అ ను భూ తి

తోడ్తోనాలో నేదో గొప్ప ప్రజ్ఞప్రవేశించి యూగించి వైచుచున్నట్లు గోచరింపఁదొడగెను. ఉత్సాహవినోదములతో దానినే పరిశీలింపఁ దొడగితిని. 'ప్రజ్ఞ' యనియో 'శక్తి' యనియో ఇంకేమనియో నిర్దేశింపఁదగిన యపూర్వానుభూతి ప్రవేశము నాలో విజృంభింపఁ దొడఁగెను. అది యెక్కడ నారంభించినది, ఏమి జరపుచున్నది యని వెదకఁ దొడగితిని. అది శరీరచర్మము లోతట్టు దాఁక వ్యాపించు చున్నట్టు తొలుత నెక్కడ నుపక్రమించినదో గుర్తుపట్ట సాధ్యము కానట్టుండెను. శరీరములో నేదో గొప్ప క్రొత్త ఇంజెన్ పనిచేయుచున్న ట్లయ్యెను. నా మన స్సానందో త్సాహములతో నలలు వాఱుచుండెను.

కొంతసేపటికి నెడమచేయి నా వశము తప్పి నా సమ్మతి లేకయే పైకి లేచుచుండుట, కుడిచేయి కదలుచు బాహుమూలమున చాల బాధ గొల్పుచుండుట తెలియ నయ్యెను. అంతకంతకు కుడిబాహుమూలపు బాధ యధికము కాఁజొచ్చెను. సంకటపడ సాగితిని. అప్పటి కించుమించుగా పదునైదు నిమిషములకాలము గడచియుండును స్వాములవారు నన్ను సంకటపడుచున్నా వేమని ప్రశ్నించిరి. కనులు తెఱవ వీలుపడక పోవుటచే మూసికొనియే బాహుమూలమున చాల బాధగా నుండుట తెల్పితిని. మఱికొన్ని నిమిషములకు కనులు తెఱపి యయ్యెను. శరీరమున సంచలనము తగ్గెను. అంతట మరల నమస్కరించి లేవవలసినదిగా దగ్గఱనే ఉన్న స్వాములవారు తెల్పిరి. లేచితిని. నా చేతికి (డిస్లొకేషన్) బండినుండి పడుటవల్ల బాహుమూలాస్థిస్థానము తప్పి చాల సంకటపడుట తెల్పితిని.

వారటి యా బాహుస్థితి సరియయిన స్థానమునఁ జేర్చుటకై జరగుచున్న ప్రయత్న మనియు, బాహుమూలమున కాయస్వాస్థ్యము లేకున్నచో కుడిచేయి కూడ పైకి లేచి నమస్కారము చేసెడి దనియు, ధ్యానావసానమున వాని యంతట నవిగా రెండుచేతులు లేచి నమస్కరించుట యీ యోగవిధానమున నపూర్వావ్యు

తానుభూతి యనియు, నట్లు కూడుట యోగశక్తి చేకూడుట కొక చిహ్నమనియు తెల్పిరి. జరిగిన విషయమును శ్రీ గురుదేవులకు నివేదింప వలసిన దనిరి. నేను శ్రీవారి సన్నిధి కరిగి జరగిన దంతయుఁ దెల్పికొంటిని. వారు చిఱునవ్వు మోమున వెలార్చి తనివితో నుండు మని యాదేశించిరి.

అట్లు ధ్యానము జరిగిన తర్వాత నొక్క గంటసేపటికే నా దక్షిణహస్తమూలము చాల వాచి బాధగొల్పెను. టక్కుటక్కుమనుచు తెక్కగూటిలో నేదో కదలిక శబ్దము వినవచ్చుచుండెను. వాపు, బాధ ఎంత యెక్కువగా నున్నను నా కది యాహ్లాదమునే కొల్పసాగెను. మూఁడు నాల్గేండ్లనుండి యా చేతితో సరిగా పనులు చేయఁజాలక బాధపడుచుంటిని. ఆ నాఁడు చేతి యెముకను క్లోరోఫార మిచ్చి సరిదిద్దిన డాక్టరు తర్వాత కొన్నాళ్ళదాఁక నా చేతిని మెలివెట్టి నలిపి చెఱపి ధనాశతో నన్నుఁ జాల పీడించినాఁడు గాన యది చక్కబడకే యుండెను. ఆ జబ్బగూటి కండలు గజిబిజి యయిపోయెను. అవి యెల్ల నిప్పుడు చక్కబడు చున్నవి గాఁబోలు నన్న సంతోషము నా కా చాపుబాధను సుసహపఱచెను. నా చేతివాపును జూచి యక్కడివా 'రదియేదో రెక్టిఫికేషన్ జరుగుచున్నది. వెఱవకు' మని తోడు పలుకసాగిరి. ఎన్నేండ్లనుండియో నిద్రలేక కొట్టుకాడుచుండు వాఁడను. నే నా నాఁటి రాత్రి కొంత హాయిగా నిద్రపోయితిని.

మర్నాడుదయమున లేచి కాలకృత్యములు దీర్చుకొని యోగానుభూతికి సిద్ధముగా నుంటిని. పూర్వదినపు సాయంకాలమున నా యూరిలోనివా రనేకులు యోగసాధనమునకు వచ్చిరి. వా రెల్ల నా యుదయమునను వచ్చియుండిరి. పూర్వ దినము సాయంకాలమున జరగినట్లు నాకు నాఁ డుదయమున జరగెను. అప్పు డక్కడ నున్నవారిలో రాధాకృష్ణపిళ్ళ యని, మహదేవయ్యరు అని యిద్దఱు ప్రధాన శిష్యులుండిరి. వారు నా విషయమును శ్రీవారికి విన్నవించిరి. అప్పుడు నా విషయము 'టెస్టు' తీయవలసినదిగా వారు వారి కాజ్ఞాపించిరి.

ఆ విచిత్ర విషయ మెట్టిదో యానాఁడే నేను దొలుత తెలిసికొంటిని. నన్ను దగ్గఱ కూర్చుండు మనిరి. రాధాకృష్ణ పిళ్ళగారు గురుదేవులకు నమస్కరించి కనులు మూసికొని యొక నిమిష మాగి ఇంగ్లీషుతో గ్రంథము పఠించు చున్నట్టేదో చెప్పసాగిరి. మహాదేవయ్యగారు దానిని వడివడిగా వ్రాయసాగిరి.

ఇద్దఱును యఫ్. యే. చదివినవారు, ప్రజ్ఞాశాలులు. పిళ్ళగారు వడిగానే చెప్ప సాగిరి. అయ్యరుగారు వడిగా వ్రాయసాగిరి. ఉదయము సరిగా తొమ్మిది గంటల పదునేడు నిమిషముల వేళ కది వ్రాయనారంభించిరి. పిళ్ళగారు కనులు మూసి కొన్నప్పుడు ఆంతర దృష్టికి కనుపడినవి, ఆంతరశ్రుతికి వినబడినవి చెప్పఁ దొడఁగిరి. అప్పుడు నా శరీరాంతర్భాగమునఁ గల స్వాస్థ్యాస్వాస్థ్యములు, నా మనోభావములు, నా యనారోగ్యకారణములు, తన్నివారణోపాయములు, అప్ప టికి జరగిన పూర్వజన్మములు మొదలగునవి కలవు. అది యెల్ల ముగిసిన పిదప దానిని శ్రీవారి చెంతకుఁ గొనిపోయి వినిపించిరి. వారి సమ్మతిమీఁద దానిని రికార్డు చేసిరి. ఆ కాలమున యోగాభ్యాసమునకు వచ్చి శిష్యతను బొందువారి కందఱకు నట్టి టెస్టు తీయుట జరగుచుండెడిది. నన్నుఁ గూర్చి వచ్చిన రికార్డును కాపి కోరి తిని. శ్రీవారి సమ్మతితో దానిని నా కిచ్చిరి. అది నా దగ్గఱ నున్నది.

## దివ్యబోధ

ఆ నాఁటిరాత్రి మెయిలులో నేను తిరిగి మద్రాసు వచ్చివేయవలసి యున్నది. కాన నా విషయమును గూర్చి శ్రీవారితో సంభాషించుటకు నదను కోరితిని. నా యభ్యర్థనమును మహాదేవయ్యగారు శ్రీవారికి నివేదించిరి. భోజనా నంతరము సంభాషింప శ్రీవారనుమతించిరి. అప్పుడు వారు యోగవిషయములను గూర్చి వారి యర్ధాంగిద్వారా యేవేవో యపూర్వాంశములను సేకరించుచుండిరి. భోజనానంతరమున నేఁ జేర నరిగి సాష్టాంగనమస్కారము చేసి యిట్లు విన్న వించుకొంటిని. 'మూఁడేండ్లనుండి యమబాధ పడుచున్నాను. నిద్రలేదు. శాంతి లేదు. ఆకలి, జీర్ణించుకొను శక్తి సరిగా లేవు. ఇక్కడికి రాక తలఁపునకు నందఁ బోవుననఁగా నా యెఱుకకు దెలియకుండనే సరిగా భోజనము చేయగల్గితిని. మీ యోగమాహాత్మ్యమును శ్రీ నరసింహముగారి ద్వారా విన్నంతనే నాలో నేదో దివ్య సౌఖ్య సౌధమునకు బాట గోచరించుచున్న ట్లయినది. ప్రశాంతముగా రాఁగలిగితిని. రైలులో కొంత నిద్ర పట్టినది. ఇక్కడికి వచ్చి కడచిన రాత్రి సుఖముగా నిద్రించితిని. నూనె తిరుగబోత, ఆవాలు, సాంబారు, రసము, పల్చని మజ్జిగ యివి నాకింతకు ముందు కడుపులో మంటలు గొల్పెడివి. ఇప్పు డవి వికటింపలేదు. మీరు నిర్భయముగా అందఱతోపాటు భుజింపవచ్చు

సనఁగా నట్లు చేసితిని. పూర్వము తీవ్రమయిన మందులు పుచ్చుకొంటిని. ఏదాది కడుపు ఉడికి పోవుచున్నట్టుండును. నేఁ డది లేదు. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అని 'బ్రదికి ఉంటే బలుసాకు ఏఱుకొని తినవచ్చు' నని ఉన్నది గాన నే నిక్కడ మీ సేవకుఁడనుగానే యుండఁ గోరుచున్నాను. ఇక్కడ నుండియే జీవిక నేదేని సమకూర్చుకొందును. అనుగ్రహింపు' డంటిని.

వారు నీ కిప్పుడు 'జీత మెంత?' అని యడిగిరి. ఏఁబది రూపాయ లంటిని. 'దీనితో నీవు నీ కుటుంబమును పోషించుకోవచ్చును. ఉన్న జీవికను మానుకొని యిక్కడ నుండ నేల?

> బండి నడచుచుండఁగానే రిపేరు సాగవలెను. బండి ఊడఁదీసి చేయుచో బండివాని జీవిక చెడును. అట్టిది నా యోగమార్గము. సాగుచున్న ప్రవృత్తికి భంగము కలుగరాదు. ఇది నివృత్తి మార్గము కాదు. రాజయోగ మార్గము. గార్హస్థ్యము ఉండవలెను. సన్న్యాసి కారాదు. సౌఖ్యముండవలెను. ఆహారాదులు సరిగా ససిగా కయి కొనుచుండవలెను.

ఇట్టిచో నీవు నీ యుద్యోగమున నుండు టావశ్యకము. నీ యుద్యోగము నీ జీవికకే కాక లోకమునకుఁ గూడ నుపకారకము. ఆరోగ్యవంతుఁడవై నీ యుద్యోగమున నుండి తిన్నగా సాగించుకొనుచుండుము. నీ విక్కడ నుండఁ గోరుట నా సన్నిధి లాభముకొఱకే గదా! "నేను సదా నీలో నుందును. నీకు వలసిన సహాయము నీలోనుండి జరపుచునే యుందును." ఇక్కడ నీ కే తీరున శరీరమున సంస్కారము జరగుట గుర్తుకు వచ్చెనో, ఆ తీరుననే యెక్కడ నున్నను అనుభూతి గుర్తుకు రాఁగలదు. ఉదయము జరపిన యోగ సాధనము శరీరమున సాయంకాలముదాఁక పనిచేయుచునే యుండును. ఎప్పు డెప్పుడెం తెంత జరగవలెనో అంతంత జరగును.

నీలోని సంస్కారము జరపునది ప్రజ్ఞాకలిత మయిన చైతన్యముగాని జడశక్తి కాదు. అది యెలక్ట్రిసిటీవలె పనిచేయునది గాదు. ఎలక్ట్రిసిటీ హద్దు దాటి అక్రమముగా నుపయోగించినచో కీడు తేఁగలదు. నీలో నిప్పుడు క్రొత్తగా



ప్రార్థనలో శ్రీ ప్రభాకరులు

ప్రవేశించిన ప్రజ్ఞ నీ వధికముగా నుపయోగించుకోఁ గోరినను అది యట్లు పని చేయదు. ఎంత చేయవలెనో అంతే చేయును. కావలె నన్నను నీ వావశ్యకత కెక్కువగా కనులు మూసికొని యుండఁజాలవు. లోపల నావశ్యకమయిన పని జరగుచుండఁగా కనులు తెఱవను జాలవు. ఏ దేని యాకస్మికముగా కార్యాంతరము కలుగుటో, ఎవరేని వచ్చి పలుకరించుటో జరగినను అప్పుడు విక్షేపము జరగు నని వెఱవ నక్కఱ లేదు. 'ఇట్లు తొందర కలిగినది. దాని ననుభవింపవలసి యున్నది'. అని ప్రార్థనాపూర్వకముగా నంతరాత్మకు విన్నవించుకొని యా కార్యము ముగించుకొనవచ్చును. అది ముగిసినంతనే జరగవలసిన యోగ సాధన జరగఁగలదు ప్రయాణములో, రైలులో, బండిలో, నడకలో ఇంకే మేని వ్యవహారములలో వర్తిల్లవలసి వచ్చినప్పుడు సరియయిన వేళ తప్పిపోకుండ ఒక క్షణమాత్రము మనసున స్మరించినఁ జాలును. కార్యాంతరములు తీఱి విశ్రాంతి దొరకినప్పుడు జరగవలసిన సాధన మెల్ల జరగఁగలదు.

వివేకమును సత్యమును ధర్మమును గుర్తించుకొనుచు నంతరాత్మ నారాధించుచు లోలోఁ జొచ్చుకొలఁదిని నీకు వలసిన యుద్బోధములు లభింపఁగలవు. అట్టి యుద్బోధములను నీవు నీలో నెక్కడనుండి యెట్లు పడయుచుంటివో క్రమక్రమముగా తెలిసికొనఁగలవు. ముందు నీ దృష్టి ఆరోగ్య లాభమున ప్రసరించుచున్నది. అది లేక నీ వేమి గాని పడయఁజాలవు. ముందు నీ కారోగ్యమే తర్వాతనే యోగసాధన ఫలము దొరకఁ గలదు గాఢముగా విశ్వసించితి వేని. నీకు యోగఫలము లభింపఁగల దని నే ననుట లేదు. నీ కా విశ్వాసమును, గొల్పవలసినవాఁడను నేనే. నీవు పరమార్థ కుతూహలిగా నుండినఁ జాలును. యోగసాధనము నాకలిగొన్న రిక్తకడుపుతో నుండి చేయరాదు. ఏ దే నాహారము గొన్న పిదపనే చేయవలెను. మద్రాసులో నీ యోగమార్గమున నడచుచున్న మిత్రులు పలువు రున్నారు. తఱచుగా వారిని గలసికొనుచుండుము. వీలు కలిగి నప్పు డిక్కడికి వచ్చుచుండుము. ప్రధానముగా డిసెంబరు తుదివారమునను, మే తుదివారమునను, ఇక్కడ గోష్ఠి జరగును అప్పుడు తప్పక రమ్ము' అనిరి. నా కనుల వెంట ధారలుగా నీరు కారెను. ఈ శ్లోకము రచించితిని.

'దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదా దయి మాస్మ ఖైషీః
త్రాతా హ మస్మీతి దదా వభీతిం
య స్తం గురుం మస్తకతో నమామి'

ఇట్టి సంభాషణతో నైదాఱు నిమిషములు గడచెను.

ఆ దినములలో వారు ముఖ్యమయిన తత్త్వార్థములను సహస్రారము, పిట్యూటరీ, అక్కడి దివ్యశక్తులు, వాని ప్రసారము మొదలగు వానిని గూర్చి శిష్యులకు బోధించుట, దివ్యదృష్టితో వానిని ముఖ్యశిష్యులు పరికించున ట్లనుగ్రహించుట, ఇంక నందలి విషయవిశేషములను మాతృశ్రీ ద్వారా తా మపూర్వముగా సేకరించుట జరగుచుండెను. కాన నా కంతకంటె నధికముగా, ప్రత్యేకముగా వారితో సంభాషింప ననువుపడ దయ్యెను.

## చేకూడుట

మఱల సంజ వేళ కక్కడివారు శిష్యులు పలువురు విచ్చేసిరి. భగవద్భట్టము పేరి కావేరీతీరఘట్టమున నే శ్రీవారి సన్నివేశమున కెదురుగా వెలయుచున్న యోగ శాలలో ఎల్లరను గూడి యోగసాధన చేయుట జరగుచుండెను. చాలాగా వాచి యున్న నాచేయి నాఁటి సంజ ప్రార్థనమున నెంతో చక్కబడెను. వాపు తీవ్ర తగ్గెను. నాలో లోలోపల నెక్కడో చిఱువెల్గు గోచరించుచున్నట్టును దానికి నేను జేరబోవుచున్నట్టును స్వప్నప్రాయముగా లీలగాఁ గొంత గోచరింపఁ దొడగెను. శరీరమున బ్యాటరీ పెట్టి నరముల నెల్ల నూగించి వేసినట్టు గొప్ప యూపు కలిగెను. చేతులు వాని యంతట నవియే లేచ నమస్కరించెను. కాని కుడిచేత నింకను బాధ గోచరించుచుండెను. టక్కు టక్కుమని జబ్బ యెముక యదరు తెలియుచుండెను

శరీరమున నింత తీవ్రసంచలన మేమిటి? ఇది యెక్కడ నుండి యారంభమై జరగుచున్నది? ఇంత దాఁక నెన్ని శ్లోకములో, ఎన్ని మంత్రములో, ఎన్ని ధ్యానములో, ఎన్ని క్షేత్రములో, ఎన్ని దేవతాదర్శనములో, ఎందఱ యాశ్రయములో జరపితిని గాని యిట్టి విశేష మెక్కడ గాని యెప్పుడుగాని జరగుట

యెఱుఁగనైతినే! ఒక తూరి ప్రార్థనమాత్రముచే నింత జరగుట యేమిది? అస్తి నాస్తి విచికిత్సాస్పదముగా నున్న పరతత్త్వము అస్తియని స్పష్టముగా ననుభవింపనగుచున్నట్లున్నదే? దీని లోఁ తేదో తెలిసికొనవలెను గదా! త్రోవ దొరకినది గదా! నా ప్రార్థనమును లోన నెవరో వినుచున్నట్టు – సమాధానము చెప్పుచున్నట్టు అనుగ్రహించుచున్నట్టు అగుచున్న దేమి వింత? నా జబ్బు నాకు చాల ఉపకారమే చేసెనా యేమి! ఇక నా జబ్బు కుదిరినట్టే తోఁచుచున్నదే! ఏమి యానందము! ఏమియు లేకున్నచో నా చేయి యింత వాచుటేమి? నావశము తప్పి చేతులు లేచి నమస్కరించు టేమి? చే కూడుట యేమి? 'చేకూడుట' అన్న పదము కల్పించిన వారెవరు? ఈ రెండు చేతులు లేచి కలసి నమస్కరించుటను సూచించునదిగా నేర్పడినదా యేమి చేకూడు, కైకూడు పదకల్పనము? నే నారోగ్యవంతుఁడ నగుచో మా వా రెంత సంతోషింతురు! మావారి నందఱను నిందుఁ జేర్పఁ గల్గుదునా యేమి? ఇత్యాది భావము లాధ్యానసమయమున మెఱపులు మెఱసినట్లు నాలోఁ జెలరేగ సాగెను. ఆనాఁటిస్థితి నా కొక జన్మ మబ్బిన ట్టుండెను. ధ్యానావసాన సమయమున నా యుత్సాహ మక్కడి మిత్రులకుఁ దెలిపితిని. అక్కడివారు వారి వారి యనుభూతి విశేషములఁ గొన్నింటిఁ జెప్పిరి.

## శ్రీ మాస్టరుగారు

అప్పుడు శ్రీవారి జీవితచరిత్రము తెలిసికొనఁగోరి యక్కడివారి నడిగితిని. పూర్వ మెప్పుడో శ్రీకృష్ణదేవరాయల పాలన కాలమునఁ గాఁబోలు తెలుఁగుదేశమున నుండి తంజావూరి రాజ్యసంరక్షణకై విచ్చేసినవారిలో వీరిపూర్వులు ముఖ్యులనియు, కుంభకోణమున భగవద్ఘట్టమునఁ జాల యిండ్లు వీరి పూర్వులవేయనియు, వీరి పూర్వులొకరు కావేరీతీరమున కుంభకోణముననే భక్తిపురి యను నగ్రహారము వెలయించిరనియు, వీరు బాల్యమున చాల ఐశ్వర్యవంతులనియు, నప్పటికిని జాలినంత సంపత్తి కలవారే అనియు, ఇంటిపేరు కంచుపాటివా రనియు, శ్రీ వెంకాస్వామిగా రని శ్రీవారి నామధేయ మనియుఁ దెలిసికొంటిని. అప్పుడు వారికి సంస్కృతము తెలియునా యని యడిగితిని. సాంఖ్య యోగ వేదాంతాది శాస్త్రములు సంస్కృతముననేకలవు గాన యా సంస్కృతము రాక యాయా శాస్త్ర విషయములు తెలియఁగా దన్న తలఁపుతో నే నట్లడుగుట. వారికి సంస్కృతము

రాఁదనియు చిన్ననాఁడాయాశాస్త్రాంశముల నాంగ్లభాషతోఁజదివి వాని సారార్థ మెల్ల గ్రహించిరనియు, సంప్రదాయముతో శాస్త్రములఁ జదివినవారికంటె నెంతో యపూర్వార్థము లెఱుఁగుదురనియు, నతిలోకానుభూతు లెన్నో యనుభవించిరనియు, శాస్త్రపండితులతోడి వాదినిగా పీరిని దలఁప రాదనియు, క్రమముగా నెల్లవిషయములు నీకే తెలియఁగల వనియు నక్కడివారు చెప్పిరి.

ఇంగ్లీషుభాషతో నుపదేశార్థము లుండు టేమి? పవిత్రమయిన సంస్కృతము కలదు గదా! అది రాక యిట్లు చేయుటా? శ్రీవారు మహనీయు లగుట దర్శన మాత్రముచేతనే యెఱుక కందుచున్నది. నిజమే కాని వారికి మీసలుండు టేమి? ప్రాచీనమహనీయుల సంప్రదాయమునకు విరుద్ధము గదా! యని నాలో నేవేవో కొంతసేపు చీకాకులు కూఁగ కలిగినవి. కొంతసేపటికి వాని కన్నింటికిని సమాధానములును తోఁచినవి. తర్వాత గొన్నాళ్ళకు విచారింపఁగా నా సమాధానములను శ్రీవార్రే పలుతూరులు చెప్పుచుండినట్లు తెలియవచ్చెను—

'యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి ।'

అన్నట్లు స్వయంప్రజ్ఞ కలవారే శాస్త్రనిర్మాతలు. అట్టివారికి ప్రాచీన శాస్త్రాదిపఠనము తమ ప్రజ్ఞకుఁ గల యపూర్వతను గుర్తించుట కుపయోగపడునుగాని ప్రజ్ఞోద్బోధము స్వయము సమకూడవలసినదే. ప్రాచీన శాస్త్రములు దానికి జనకములు కాఁజాలవు.

"శాస్త్రాణాం విషయ స్తావ ద్యావ న్మందరసా జనాః
ప్రవృత్తే రసశాస్త్రే తు న చ శాస్త్రం న చ క్రమః"
"త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః
నానుధ్యాయా ద్బహూ ఞ్ఛబ్దా న్వాచో విగ్లాపనం హి తత్"
"విహాయ శాస్త్రజాలాని య త్సత్యం త దుపాస్యతామ్"

ఇత్యాది సూక్తులు స్ఫురణకు వచ్చి భాషలో నేమున్నది! విషయము గదా ప్రధాన మయినది! ఏభాష యయిన నేమి? అందును జాతిమతదేశాదికృత మయిన

పరిచ్ఛేదము లేకుండ సర్వసమానముగా సాగవలసిన యిట్టి మహత్తరయోగ పద్ధతికి—నేఁడు ప్రపంచవ్యాపకముగా నున్న యాంగ్లభాషయే సరిపడి యుండు నేమో! మఱియును సంస్కృతమున కట్టి పూజ్యత మహర్షులు తమ యుద్బోధముల నందే వెలయించుటచేతను, ప్రాచీన తత్త్వశాస్త్రము లందే పెంపొందుటచేతను, ఉప నిషత్తులును వేదములును నందే యుండుటచేతను వచ్చినది—అట్టివానిని నిపుడును వెలయింపఁ గలవా రుండుచో వారు వాని నే భాషలో వెలయింతురో యా భాషకు నట్టి పూజ్యత తప్పక కలుగఁగలదు. ఆంగ్లభాషకుఁ గూడ నట్టి యోగ్యతకలదని యంగీకరింపక తప్పదు. నేఁడెందరో మహనీయు లా భాషద్వారమున ననేకాపూర్వ శాస్త్రార్థములు వెలయించుచున్నారు. దీనిని పరిగణింపక త్రోసిపుచ్చుట సాధ్యము కాదు. కనుక శ్రీవారియోగోపదేశ భాషాదు లాంగ్లమున నుండుట కొఱఁతగాదు.

మఱియు వారి యాకృతిమహనీయతకు మీసము లుంచుకొనుట, మొగమున బొట్టు పెట్టుకొనకుండుట కొఱఁత పఱుపఁజాలవు. శైవవైష్ణవాది మతభేదములను పాటించువారు గారు గాన వారు మొగమున తన్మతచిహ్నముల ధరింపకుండవచ్చును. వారు నెలకొల్పినది మహారాజయోగముగాన దీనికి బోడితల కాషాయవస్త్రములు మొదలగునవి యుండ నక్కఱలేదు. మీసము లుండుట లేకపోవుటలో న్యూనాధి కత లుండవు. ఈ సమాధానములు తోఁచి నా మనసులోని యప్పటి మకిలను దొలఁగించినవి.

కొంత కాలమయినతర్వాత నేను మరల కుంభకోణము వెళ్ళియుండఁగా శ్రీవారే నే నడుగకుండనే యీ విషయమును గూర్చి యిట్లనిరి. 'నాకు శిష్యులుగా నుండువారెవరు గాని లోకమునకు విడ్డూరముగా తోఁచదగిన వేషభాషలతోనుండుట బాగుగాదు. నలుగురతోపాటుగానే యుండవలెను. ఈ యోగమున నెవఁడుగాని ప్రత్యేకముగా కడతేరఁజాలఁడు. తాను, తన చుట్టుపట్టులవారు, తన యాప్తులు ననుక్రమమున ప్రేమ వ్యాపకమగుతీరు ననుసరించి తాను, తన చుట్టుపట్టులవారు, తన యాప్తులు ననుక్రమముగా లోకము నంతను ప్రేమించి లోకమునంతను గడ తేర్చువాఁడు కావలె. తన ప్రేమ సర్వలోక వ్యాపకము కానంతవఱకు నెవ్వఁడు గాని కడతేరఁజాలఁడు. అఖండము, సర్వవ్యాపకము నగు తత్త్వమును బడయు టకు తాను నఖండుఁడు, సర్వవ్యాపకుఁడు కాక తప్పదు. దేశ కుల జాతి మతాది పరిచ్ఛేదములతో వేఱుపడిపోయి సర్వప్రజతో సామరస్యము కుదుర్చుకోలేనివాఁడు

సంసారబంధమున కొట్టుకాడవలసినవాఁడే! బహిర్ముఖముగా సాగుచున్న బహుత్వ మును సాగనిచ్చుచునే అంతర్ముఖముగాఁదిరిగి అందేకత్వమును గుర్తించి వర్తించుట ఈ యోగసాధనమునకొక ఫలితము. మన పరిపూర్ణత భవిష్యత్తులోనున్నదిగాని భూతముకాలేదు. కనుక భూతమను పీఠికపై నెలకొని భవిష్యత్తున పరమార్థ మను భవింపవలసి యున్నది.'

శ్రీవారి దివ్యప్రజ్ఞలలో నొక్కటి యిది. ఎవ్వరుగాని లో నేదేని సందేహమో, వ్యాకులపాటో చెందుచు సన్నిధికి వచ్చినప్పుడు వారి నడుగకే, వారడుగకే వింతగా దానికి సమాధానము యాదృచ్ఛికసంభాషణ సందర్భమున వెల్లడించుట—ఒండె—ఆసమాధానము నడిగి తెలిసికొనఁ గోరి వారిసన్నిధికి వచ్చు సంతలో నాపృచ్ఛకుల తీరులోనే యా సమాధాన మాప్రష్టల కెఱుకపడుకుండనో, అంతలోనే యెఱుక కందుచునో శ్రీవారు నోరెత్తనావశ్యకత లేకుండనే బాహిర పడుట—

ఒక చిన్న దృష్టాంతము. ఇంజనీయరింగ్ డిపార్టుమెంటులో ఉద్యోగిగా నున్నయొక శిష్యుని ఢిల్లీలో హెచ్చుజీతముతో నుద్యోగించుటకు సమ్మతింతువా యని పైయధికారు లడిగిరి. నాఁటి సాయంకాలపు టపాలో దానికి బదులు వ్రాసి పంపవలెను. దీని నడిగి తెలిసికొనుటకే ఉదయమాతఁడు మద్రాసునుండి వచ్చి వెంటనే తన విషయమును శ్రీవారికి విన్నవించెను. 'సరే! టపావేళలోగా యోచించి బదులు చెప్పుదు' ననిరి. సాయంకాలము టపావేళ దాటిపోవచ్చినది. శ్రీవా రాత నిఁబిలిచి బదులేమి గాని చెప్పరయిరి.

ఆతని యోచనలు తీవ్రముగా రేగెను. అనుకూల ప్రతికూలపక్షముల యుక్తులు గుప్పగుప్పమని లోనుండి వెల్వడఁజొచ్చెను. త్రాసున తూపగా 'వెళ్ళవలదు' అన్న పక్షము బరువెక్కువ గలదిగా గానవచ్చెను. ఆత్రతపాటుతో నదే సమాధానము జాబులో వ్రాసెను. 'శ్రీవారు బదులు పలుకరైరి గదా! ఇక నాలసింపరాదు, కనుక దీనినే పోస్టు చేయుదు'నని యాతఁడు యోగశాలనుండి బయల్వెడలెను.

శ్రీవారు తమయింటివాకిట నుండిరి. రమ్మని కనుసైగచేసిరి. చేరబోగా 'చేతిలో ఏమిటది?' అనిరి. ఆతఁడు 'బదులువ్రాసితిని. అనుకూలపక్షములు

యోచించి చర్చింపఁగా ప్రతికూలపక్షము బలవంతముగా తోఁచెను. తామేమి సెలవిచ్చిన నట్లు చేసెదను. టపావేళ దాటుచున్నది. కాననాకుతోఁచినది వ్రాసితిని. తద్విరుద్ధముగా మీరు సెలవిచ్చిన నట్లు వెంటనే చేసెదను' అనెను. 'ఈజాబే పోస్టులో వేసిరమ్ము' అనిరి అతఁడట్లే చేసెను.

తర్వాత సమయాంతరమున నిట్లు చెప్పిరి. 'మీ కేమిగాని సందేహములు తోఁచినచో తోఁచినవానికి బదుళ్లు యోచింపక వెంటనే వాని నట్లే నాకు వ్రాయుటో, అడుగుటో చేయవలదు. మీచేత నయినంతవఱకు వానిసమాధానములను మీరే కనుగొన యత్నింపుఁడు. ఎంతకును సమాధానము దొరకనివానినే నన్నడుగుఁడు. న్యాయమైన, సంగతమైన ప్రశ్న మెవరికిగాని తోఁచినచో, నాప్రశ్నపుఘనత ననుసరించి దానికి తగినంత యత్నము చేసినచో సరి యయిన సమాధానము దొరకఁగలదు. ఆ యత్నము బహిర్ముఖమగు ప్రాచీనగ్రంథాదులవల్ల తనకు విజ్ఞులుగాతోచు నాప్తులవల్ల తెలియఁదగిన దగును. అంతర్ముఖమగుచో ఆత్మోద్బోధ రూపక మగును. ఈ యోగ మట్టియాత్మోద్బోధమును గొల్పుటకే.

బహిర్ముఖముగా సమాధానము తెలియఁగోరుచో, 'అనంతశాస్త్రం బహు వేదితవ్యం' ఆయాశాస్త్రములును,దత్ కర్తలును బహుభేదములవారు. అందెవరిది గ్రాహ్యమో తేల్చవలసినది మరల నాత్మోద్బోధమే. ఘట్టకుటీప్రభాత న్యాయమున నెల్లరు నెట్లు గాని యాత్మోద్బోధముల ననువర్తింపవలసినవారే, అనువర్తించు వారేకాక తప్పదు. బహిర్ముఖముగా లభించువిజ్ఞానమును దోడు చేసికొని యాత్మోద్బోధముల నందుకొనఁ గల్గినచో పరమార్థముల సులువుగాఁ బడయ వీలుపడును.'

ఆనాఁటి సాయంకాలమునకు నా చేతి వాపు చాల తగ్గినది. యోగసాధనానంతరము రామజపమువలె కొంత దడవు తదేకానుధ్యానము చేయఁ బూనితిని. ఒడలెల్ల మంటలెత్తినట్లయ్యెను. అది శ్రీవారితో చెప్పితిని. నియతసమయములలో తక్క నితరసమయములలో నా యనుష్ఠానము చేయరా దనియు, ఏదేని యావశ్యకత కల్గినచో నప్పు డొక క్షణము స్మరించినంత మాత్రమున దానికి జరగఁదగిన సౌకర్యము జరుగు ననియు, త దేకపారాయణ చేయుటకు పరతత్త్వము చెవిటి గాదనియు, నోటిమాటను చెవి విన్నట్టే మీ యభ్యర్థనముల నది వినఁగలదనియు, ఒకతూరి ప్రార్థించి నంతనే సర్వసిద్ధముగా ననుగ్రహింపఁగా నది చూచుచుండగా

మరల మరల నడుగు చుండవలె యనియు ననిరి. టెలిఫోనులో ఒక తూరిపిలువగా నవతలివారు సిద్ధముగా బదులుపలుకుచుండగా దానిని వినక యూరక పిలుపులే పిలుచువాని తీరువంటిది పదింబదిగా స్మరించుచుండుట యనిరి. ఈ యుపదేశపు యాథార్థ్య మటుతర్వాత పరసహస్రపర్యాయములు నాకును నా మిత్రులకును ననుభూతి కందినది.

1925 వ సం॥ ప్రాంతముల నొకమిత్రుఁడు నిరంతరము శ్రీవారిస్మరణమే రామనామజపమువలె జరపుట సాగించెను. కొన్నాళ్ళకు శరీర మెల్ల నగ్నిజ్వాల వలె నయ్యెను. నిద్రలో నరములు బిగించిన ట్లయి త్రుళ్ళిపడుట, క్రమముగా నిద్ర పట్టకుండుట యేర్పడెను. బంధువులు పలువైద్యములు చేయించిరి. యోగమునే మాన్పించిరి. ఏమియు లాభము లే దయ్యెను. జరిపిన తప్పిదమునకు పశ్చాత్తాపము నొంది క్షమింప ప్రార్థించి సక్రమముగా నడచుకొనసాగించిన తరువాత నారోగ్యము చక్కఁబడెను. ఆ మిత్రుఁడు నేఁడును క్షేమముగా యోగసాధనము చేయు చున్నాఁడు. అనధికారముగా, అక్రమముగా సాధనములు సాగించిన వా రింక నెందఱో పశ్చాత్తప్తులయి బాగుపడవలసినవా రైరి.

## న వ జీ వ న ము

నాఁటి రాత్రి శ్రీవారి నిదేశము చొప్పున మద్రాసుకు హాయిగానే బయలు దేరితిని. కుంభకోణమున నుండి మాయవరము దాఁక రైలులో వచ్చితిని. పలువు రక్కడ దిగుచుండిరి. నేనును ఆ స్టేషనులో దిగి అక్కడ చాలసేపు రైలాగునది గాన ప్లాట్‌ఫారం మీఁద కొంతదడవు నిటు నటు తిరుగాడితిని. రైలెక్కితిని. అది బయలుదేరెను. నేను తలుపు దగ్గరనే నిలుచుంటిని. నన్నెవరో బయటికి పడ ద్రోయు చున్న ట్లయ్యెను. మరల తొంటిరీతి కంపము, నిరుత్సాహము తోఁచెను. తోడ్తో రైలు ద్వారము దగ్గఱ నున్న నాకు హరిద్వారము తలఁపునకు వచ్చెను. పాడు తలఁపు క్రిందికి దూకుదునా యనియుఁ దోఁచెను.

అల్లంతలో నన్నెవరో వెనుకకు నెట్టుచున్నట్లయ్యెను. ఇది నాలో జరుగు చున్న సదసద్వివాదముగా గోచరించెను. పూర్వముకంటె నిప్పుడు గొప్పజ్వాల లోపల వెలుఁగుచున్నట్లయ్యెను. పూర్వ మెక్కడో మిణుకు మిణుకుమను నాశా

జ్యోతి యుండెడిది. నే నీ సంకల్ప వికల్పములతో నిటు నటు నూగుచుండగా లోఁ గూర్చున్న సహృదయుఁ డొకఁడు భగవదావిష్టునట్లు తనప్రక్క చోటు చూపుచు 'అయ్యా తలుపు తెఱచి యున్నది. క్రింద పడగలరు! ఇటు వచ్చి కూర్చుండుఁడు' అనెను. వెంటనే వెళ్ళి కూర్చుంటిని. అతఁడు లేచి నాకు మఱీ చోటిచ్చెను. 'నేను తర్వాతి స్టేషనులో దిగిపోవుదును గాన యిఁక కూర్చుండను. మీరు సుఖముగా కూర్చుండుఁడు' అని నన్నుఁ గూర్చుండబెట్టి తానే తలుపు వేసి తలుపు దగ్గఱ నిలుచుండెను. న న్నట్లు రక్షించినవారు గురుదేవులే యగుట, వారి ప్రజ్ఞాంశము నాలో నుండుట కాలక్రమమున స్పష్టముగా గుర్తింప నయ్యెను.

మద్రాసు చేరుదాఁక నే నున్నచోటునుండి కదలక రైలు కంటె ముందుకు దూకుచున్న తలఁపుల వేగముతో నిద్రమేలఁకువలతో శాంత్యశాంతులతో మద్రాసు వచ్చితిని. వెంటనే మిత్రులను గలసికొని జరిగిన సందర్భము లెల్లఁ దెలిపితిని. అవి వేసగి సెలవుల నాళ్ళు గాన మా బావ, తోబుట్టువులు మా గ్రామమునకు వెళ్ళియుండిరి. మరల జనార్దనుని హోటలులో భోజనము చేయుచు ఆఫీసుకు వెళ్ళి పని చేయ సాగితిని. ఆఫీసులో అందఱు నా యనారోగ్యము నెఱిఁగి యుండిన మిత్రులే కాన నా కట్టె తొందర కలిగింపకుండిరి. నాఁటి దాఁక నా యనారోగ్యమును గూర్చి వంత చెందుచు నే నెక్కువ కాలము జీవింప బో ననుకొనుచున్న నా మిత్రుఁ డొకఁడు, ఆఫీసులో ఉద్యోగి కలరా వచ్చి యదాటుగా చనిపోయి నాకు చాల చింతఁ గొల్పెను. సాయంకాల మయిదు గంటల దాఁకఁ బని చేసి బడలి యింటికి వచ్చి సాయంకాలానుష్ఠానమున బడలిక తొలఁగి మరల నుత్సాహినై రాత్రి గడపి ఉదయోపాసనమున మఱింత తేఱి ఆఫీసుకు వెళ్ళుచు దినక్రమమున నారోగ్య వృద్ధి బడయఁ జొచ్చితిని. దినదినము నరసింహము గారి యింటికి వెళ్ళి వారితో గలసి యుపాసనము జరపుచుంటిని.

ఆ నాళ్ళలో మద్రాసులో శేషయ్యంగా రను నొక వైష్ణవుఁడు తంజావూరుజిల్లా వాస్తవ్యుఁడు 'ధ్రువనాడి' యను సంస్కృత గ్రంథము నుండి యనేకుల జాతకముల చదువుచుండెను. ఆ యాచార్యుఁడు తొలుత చాల ననారోగ్య గ్రస్తుఁడుగా నుండి శ్రీవారి శిష్యుఁడై కుంభకోణమున వసించి యారోగ్య వృద్ధి చెందెను. కాన మా గోష్ఠిలోని వాఁడయ్యెను. ఆయన శ్రీవారి జాతకమును,

మా గోష్ఠిలోని వారయిన యితరుల జాతకములను జదువుచుండెను. కొంత తద్వైచిత్రి కనుగొనుచు వింత చెందుచుంటిని.

పదిరోజులు గడచి నేను గొంత తేరుకోఁగా నన్ను కృష్ణాజిల్లాలో గ్రంథార్జనమునకుఁ బొమ్మని మా పై యధికారి శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారు నామీఁది యనురాగముతోనే యాజ్ఞ యిచ్చిరి. వెంటనే నేనును, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును వెడలితిమి. కృష్ణ కాల్వల క్రొత్త నీటి స్నానపానములు మా కిద్దఱకును సరిపడలేదు. బందరు నుండి రోడ్డు సైడు కెనాల్ నీటిలో పడవమీఁద చల్లపల్లి వచ్చితిమి. కవిగారికి వేచిన జీడిపప్పన్న చాల ప్రీతి. బందరులో నది మంచిది దొరకును గాన వారు దాని నధికముగా గొనితెచ్చిరి. పడవలో కబుర్లు చెప్పుకొనుచు నిద్దఱము దానిని తింటిమి. నేను మితముగా, వా రమితముగా! ఆ రాత్రి కవిగారికి వాంతులు, విరేచనములు, జ్వరము, కలరా అనుకొంటిమి. సత్రములో నుంటిమి. ఆ రాత్రి యా సత్రములో మా బంధువు లొకరు మాకు సర్వోపచారములు చేసిరి. ఉదయము బజారులో టర్పంటైను, బ్రాంది మొదలగు నౌషధద్రవములకుఁ బోగా వర్తకు లెవ్వరు నియ్యరైరి. రామకృష్ణకవిగారు 'ఎం. ఏ.' మద్రాసునుండి గ్రంథార్జనమునకై రాజుగారిని దర్శించుటకై వచ్చుట, వారితో నేను నుండుట యిత్యాదికము వెల్లడి యయ్యెను.

ఆ యూరికి వచ్చు పెద్దమనుష్యులకు, ఉద్యోగులకు వలసిన పదార్థములు రాజాగారే యియ్యవలెను గాని కోమట్లియ్యఁ గూడ దని యను శాసనము. కవిగారు "కాళ్ళీడ్చుకొని పోవుచున్నవి. జీవితము నిల్చునట్లు లేదు. కలరా గాఁబోలును. బ్రాంది కావలెను. కాళ్ళకు టర్పెంటైను రాయవలె" నందురు. అవి దొరకలేదు. రాజాగారిని దర్శింప మధ్యాహ్నము గాని వీలుపడలేదు. రాజాగారు భోజనానంతరము నిద్ర లేచిన తర్వాత నేఁ బంపిన వార్త వారికిఁ దెలుప ననువుపడెను. వలసినవానిని వారు పంపిరి. అప్పటికే కవిగారికి మా బంధువుల యుపచారములచే గుణముగా నున్నది. మందు లక్కఱ లేకే పోయెను. ఈ వార్త ఆఱుమైళ్ళ దూరమున నున్న మా గ్రామమునకు తెలియగా, మా తండ్రిగారు పంపగా మా పినతండ్రిగారు బండిలో మమ్ము తోడ్కొనిపోయిరి.

చల్లపల్లిలో నే కవిగారి యుపచారములలో మునిఁగి యుండుట, వారితో నేను జీడిపప్పు తిని నీరు త్రాగియుండుట కారణములుగా తల తిరుగుట, వాంతులు, జ్వరము నాకు నారంభించెను. ఇంటికి చేరునప్పటికి నాకు 100 డిగ్రీల జ్వరమున్నది. నేను మందుఁ గొన నను చుంటిని. కుంభకోణము టెల్లిగ్రాం ఇయ్యఁగోరితిని. వెంటనే మా వా రట్లు చేసిరి. కాని యది వారి కందుట నాఁటి రాత్రి యగునో, మర్నాడగునో, చాల తీవ్రజ్వరము గాన మందిచ్చి తీరవలసినదే యని నాకుఁ జాటుగా మా తల్లిదండ్రులు, నన్నగారు చర్చించుకొనుచుండిరి. అది వింటిని. పిల్చి యడిగితిని. 'మందు గొనవలసినదే' యనిరి. అంగీకరించి తిని. సాయంకాలము ఆఱుగంటలవేళకు మందిచ్చిరి. అప్పుడే ఆకాశమున నుండి దభీలున క్రిందఁ బడుచున్నట్టు లయి యొడలెల్ల చెమ్మటనీరు చిమ్మఁ దొడఁగెను. పది నిముషములలో జ్వర మెల్లతగ్గెను. 'మం దిచ్చితిమి. తోడనే తగ్గెను' అని మా వా రనుకొనిరి. 'ఇచ్చిన టెల్లిగ్రాం శ్రీవారికి చేరినది. ట్రీట్మెంటు జరగి యుండును. తోడనే తగ్గినది' యని నేను దనిసితిని. మర్నాడు తేటగానే యుంటిని. మందు గొనుచుంటిని. మూఁడవనాఁడు మరల జ్వరము వచ్చెను. నాఁడు కుంభకోణమునుండి జాబు వచ్చెను. 'జ్వరము తగ్గియుండును. మందు గూడ పుచ్చుకొన వచ్చును' అని మందు పుచ్చుకొనుటకు ధైర్యము వచ్చెను. పుచ్చుకొనుచుంటిని. సెలవు లేదు. శ్రీరామకృష్ణ కవిగారును జ్వరము మరల మరల వచ్చుచు తంటాలు గొల్పుచుండుటచే సెలవు తీసికొని మద్రాసుకు వెళ్ళి పోయిరి.

నేను చిరకాలము సెలవులో నుండి డ్యూటీలో చేరి మరల సెలవు గొనుట దుఃఖకరముగా తోఁచుటచే నెటు చేయను జాలక చిక్కు పడుచుంటిని. ఇంటి దగ్గఱ నుండ నిష్టము లేదు. జ్వరము వచ్చుచునే యుండుటచే నూళ్ళ వెంట నొంటరిగాఁ దిరుగఁజాలను. ఇట్టి యిక్కట్టుతో నింటికి వచ్చిన వారము రోజుల లోనే నాకు ఆఫీసునుండి టెల్లిగ్రాం వచ్చెను. 'తత్క్షణమే నీవు తంజావూరి లైబ్రరీ పరిశీలనమునకు వెళ్ళవలసినది. అక్కడ చేరి పని చేయవలసినది' అని. అలిగి తన్నితే పఱుపుమీఁద పడ్డట్టు, రొట్టెవిఱిగి నేతిఁమీద పడ్డట్టు నాకు పరమోత్సాహ కర మయినది.

తోడ్తో బయలుదేఱి మద్రాసు వచ్చి ఆఫీసుకు వెళ్ళి లైబ్రేరియన్‌తో మాట్లాడి మద్రాసులో నాగక కుంభకోణమునకే వెళ్ళిపోయితిని. అప్పటికి మా తోబుట్టువు కుటుంబము మద్రాసులో నుండెను. మా తమ్ముఁడు చి॥ చంద్రశేఖరము అక్కడ హైస్కూలులో చదువుచుండెను. వాని కక్కడ టైఫాయిడ్ జ్వరము వచ్చెను. శ్రీవారికి జాబు వ్రాసితిని. మద్రాసులో వారి శిష్యుఁడుగా నున్న మన్మిత్రు నొకని ట్రీట్ చేయవలసినదిగా జాబు వ్రాసిరి. అతఁడు వచ్చి ట్రీట్ చేసి యీ జ్వరము తగ్గిన తర్వాత నీ కుఱ్ఱవానికి శ్రీవారి శిష్యత లభింపజేయ వలసిన దనియు, దానివల్ల నీతఁడు కొఱఁతలు దొలఁగి యారోగ్యము పడయఁ గలఁ డనియు దివ్యదృష్టికి గోచరించిన దానిని దెలిపెను. నెలా పదిరోజులు జ్వరము వానిని బాధించి విడిచెను.

కుంభకోణమున శ్రీవారిని దర్శించి నాకథ యెల్లఁ జెప్పికొంటిని. శ్రీవారు నన్ను ప్రతివారము సెలవుదినమున తంజావూరినుండి కుంభకోణము వచ్చుచుండు మనిరి. ఆ కాలమున రైలుఛార్జీ అర్ధరూపాయ లోపుగా నుండెను. అట్లే చేయు చుంటిని. తంజావూరిలో నాకు త్యాగరాజయ్య రను మిత్రుఁ డేర్పడెను. ఆయన శ్రీవారి శిష్యుఁడు. ఇద్దఱమును గలసి ప్రార్థనము చేసుకొనుచుంటిమి. జ్వరము తగ్గి యారోగ్యవంతుఁ డయిన మాతమ్ముఁడు వదినగారిని దోడ్కొని కుంభ కోణమునకు వచ్చెను. వానిని శ్రీవారి శిష్యునిఁ గావించితిని.

చల్లపల్లిలో ఆరంభించిన చలిజ్వరము ఎడనెడ నాకు వచ్చుచునే యుండెను. శరీరము చాల చిక్కిపోఁ జొచ్చెను. నేను కుంభకోణము వెళ్ళినతోడనే తీవ్రముగా జ్వరము వచ్చెడిది. మజ్జిగ అన్నమే తినఁగల్గెడివాఁడను. రాత్రి ఒకటి రెండు గంటలవేళ తీవ్రముగా ఆకలి యయ్యెడిది. అప్పుడు ముందుగానే నాకై జాగ్రత్తపడి సచ్చిదానందస్వాములవారు ఊరుగాయ, మజ్జిగఅన్నము ఎత్తి దాచియుంచెడివారు. ఆకలయి నపుడు వారిని లేపి యది తిని నీరు ద్రావి నిద్ర పోయెడి వాఁడను. ఉదయము జ్వరముతోనే తంజావూరికి వచ్చెడి వాఁడను— వచ్చిన కొంతసేపటికి జ్వరము తగ్గిపోయెడిది. వారమురోజులు నెమ్మదిగా ఆఫీసుపని చేయఁగల్గెడువాఁడను. నాతో రామకృష్ణకవిగారు వగైరా లుండిరి. వారు మద్రాసు వెళ్ళినప్పుడు శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారితో నేనేదో కుంభకోణము వెళ్ళి యోగసాధన చేయుచుంటి ననియు, అక్కడికి వెళ్ళిన తోడనే జ్వరపడి

జ్వరముతోనే ప్రతివారము వచ్చుచుండు ననియు చెప్పిరి వారు కుపితు లయి యుండిరి.

1916 క్రిస్మస్ సెలవులు వచ్చినవి. నే నా సెలవు రోజులలో కుంభ కోణముననే శ్రీవారి సన్నిధి నుంటిని. 30 దాఁక నాకు జ్వరమే. 31 వ తేది నాకు విరేచనము లెడ తెగకుండ కాఁజొచ్చినవి. నల్వది యేఁబది తూరు లయ్యెను. సగ్గుబియ్యపు జావను మిత్రులు మహాదేవయ్య గారు తెచ్చి యిచ్చిరి. త్రాగితిని గాని కదల శక్తి లేదు. నాఁ డుదయము నేను వెళ్ళి తీరవలెను. శ్రీవారి కీ యసందర్భము తెలిసెను. రామచంద్రయ్యరుగారు అనుముఖ్యశిష్యునిఁ బిలిచి ప్రభాకరునికి విగర్ సప్లై యగుటకు ట్రీట్మెంట్ చేయ మనిరి. ఆతఁడు పండుకొన్న నాదగ్గఱకు వచ్చి యట్లు చేసెను. అయిదునిమిషములలో పండుకొన్న నేను లేచి కూర్చుండి, కూర్చున్న నేను లేచి, లేచిననే నిటు నటు దిరిగి, తిరిగిన నేను పర్వోత్త గలిగి యుత్సాహశక్తిపూరితుఁడ నయితిని. కొంతపర్వాతోనే వెళ్ళి శ్రీవారి పాద ముల వ్రాలితిని. రైలు వేళ గుఱుతున్నది గాన వెంటనే స్టేషనుకు పొమ్మనిరి. 'ఇఁక నుండి యనారోగ్య ముండదు. వారము వారము రా నక్కఱ లేదు. రెండురోజులు సెలవు కలసి వచ్చిన రమ్ము. పగలు హాయిగా భోజనము చేయుము. ఉదయము మధ్యాహ్నము లఘ్వాహారము గొనుము. జీర్ణశక్తి సరిగా నుండును. లివరు సరి పడినది. రాత్రిపూట మజ్జిగ కాక పాలు పోసికొని భుజింపుము' అనిరి. తంజా వూరికి వచ్చివేసితిని.

తరువాతి జ్వరము లేదు. జీర్ణశక్తి చక్కబడినది. ఆకలి యన్నది నాఁట నుండి సరిగా తెలియవచ్చెను. దినదిన క్రమాభివృద్ధిగా నారోగ్యము కలుగ జొచ్చెను. ఆనాఁ నుండి నాకు అనారోగ్యవ్యథ తొలఁగి వింతవింత యనుభూతులు కలుగఁజొచ్చెను. ఒకనాఁ డుదయము రొట్టెపాలు (కాఫియలవాటు ముప్పది యైదేండ్ల వయసు తర్వాతనే) తీసికొని ప్రాతరుపాసనము జరపుకొని ఆఫీసుకు వెళ్ళితిని. (తంజావూరి లైబ్రరీ ఉదయము 8 గంటలనుండి సాయంకాల మయిదు

గంటలదాఁక) అప్పుడు ప్రాతఃకాలముననే కొన్ని నియమితసమయములలో సాయంకాలముదాఁక నభ్యాసము లుండెడివి.

పదిగంటలవేళ నభ్యాసము జరపుకొని టేబిలుదగ్గఱ గ్రంథపరిశీలనము జరపుచుండఁగా నా మూలాధారమునన్నుండి ప్రబలముగా పిచికారితో కొట్టినట్టు ప్రజ్ఞాబలధారలు రేగఁ జొచ్చినవి. ఉత్సాహానందములు పొంగి పొరలి శరీర మెల్ల వ్యాపింపఁజొచ్చినవి. ఆధారలు తలలోనికిఁ బోయినవి. అప్పటి నా యాహ్లా దము చెప్పఁ దరము కానిది. లోపలం బిచ్చుబుడ్డి వెలిఁగించి దానిపై పలుచనికుండ మూసినట్లు తల యూగులాడఁజొచ్చినది. లోపల నేవో మెఱుఁగు రేకలు తిరుగఁ జొచ్చినవి. అప్పుడు పని కట్టిపెట్టి వినోదింపఁదొడగితిని. పదినిమిషము లట్లుండెను. నాస్థితి యానందతాండవ మాడుచున్నట్లయ్యెను నెమ్మదిగా నది వశంగత మయ్యెను. నా యెడ లానందమయ మయ్యెను. కొలఁది దినములకే ఆ లైబ్రరి పనిని వడిగా ముగించివేసితిని.

## ఇల్లాలి యినిసియేషన్

మద్రాసు పయనము. నే నింటిసామాన్ల నన్నింటిని రైలులో మద్రాసు పంపి సకుటుంబముగా తంజావూరునుండి కుంభకోణమునకు వచ్చి నాయారోగ్యాది విషయములను శ్రీవారి కెఱింగించితిని.

నాఁడు సాయంకాలపు యోగాభ్యాసము ముగిసిన తర్వాత నన్నుఁబిలిచి శ్రీవారు 'నీ వీరాత్రి నేను సదా వర్తిల్లుచుండు యోగాలయపు గదిలో, నేను విశ్రమించుమంచముమీఁద నీభార్యతో శయనించుము. నే నిప్పుడు ఇంటనే శయనించుచుంటిని' అనిరి. నేను గడగడలాడి సిగ్గుతో అంగీకార సూచకముగా తల వాంచితిని. కాని నాకు తర్వాత చాల వెఱపు గల్గెను. అది గురుదేవులు శయనించుగది. అందు వారు విశ్రాంతి గొనుచుండ్రు! అందు నేను శయనించుటా? అందును సద్విత్తీయముగా! అని వణకితిని. ఈయాజ్ఞ నాలోనే జీర్ణించెను. వారితోనే భోజనము

చేసితిని. వారి యింటిలోని యాడువా రందఱు శయనించు చోటనే నా కుటుంబిని శయనించెను. నేను మరికొందఱు మిత్రులతో వీధియరుగుమీఁద శయనించితిని. రేయెల్ల శ్రీవారి యాజ్ఞనుగూర్చి పర్యాలోచనమే! ఉదయము తెల తెలవాఱుచుండగా తలుపులు తెఱచిన తోడనే లోని కరిగితిని.

శ్రీవారు ఇంటిలో విశాలమయిన మండువాలో చంద్ర నక్షత్రాదులు నీలాకాశము గోచరించుచుండఁగా చల్లని గాలి వీచుచుండఁగా, నొక గోల్డుమెడల్ ముడతమంచము మీఁద పలుచని పడుకపైన శయనించియుండిరి. పడుక మీఁదను, క్రిందను చల్లినమల్లెపూవు లున్నవి. పట్టుతలగడ గలదు. తెల్లని పలుచనిపట్టుసెల్లా కప్పుకొని యుండిరి మంచమునకు దోమ తెరక ప్పుండెను. అదను ప్రతీక్షించుచు వారు కనులు దెఱచి లేవ నుంకించునంతలో నేను చేర నరిగి పాదములు స్పృశించి నమస్కరించితిని. 'రాత్రి యెక్కడ శయనించితి' వని యడిగిరి. ఇంటిలో స్త్రీలతో స్త్రీయు, వాకిటియరుగుమీఁద నేనును శయనించుట తెల్పితిని. చప్పరించి 'నామాట పాటింపక పోతివి గదా!' యనిరి. సిగ్గుతో తల వాంచితిని. సరేఁ కానిలేఁ ఏమి విశేషము?' అనిరి.

'మీ దివ్యానుగ్రహమున నే నారోగ్యవంతుఁడ నయితిని. నా కీయోగమార్గమున ధన్యత చేకూరును. నాకు శరీర మొసఁగిన మాతల్లిదండ్రులు వృద్ధులు. ఎప్పుడేమిజరుగునో? వారికి మీశిష్యత ననుగ్రహింప వేఁడుచున్నాను. వారిక్కడికి రాఁజాలరు' అంటిని. 'వారివయ సెంత?' యనిరి. 'మాతండ్రిగారి వయసు డెబ్బది దాటినది' యంటిని. 'అంత వార్ధక్యమున నున్నవానినిగూర్చి యనుతపింతువేఁ చిరకాలము నీతో జీవితము గడపవలసిన నీభార్యనుగూర్చి యడుగవేమి?' యనిరి. 'చిన్నవయస్సులో నున్న యీయువిద నాతో నెప్పుడుపట్టిన నప్పుడు మీదర్శనమునకు రాఁగల్గును. కాని యెప్పుడయిన మీశిష్యతానుగ్రహమున కర్హురాలు కాఁగలదు చాల వార్ధకమున నున్నవా రని, ఎప్పు డేమగునో అని, వారిశరీర

ముతో మీ శిష్యత పడయవలె నని నాయాశ!' యంటిని. 'సరే కాని నేఁడు ఎని మిది గంటలకు నీ భార్యకు ఇఞ్జెక్షను జరుగును. అందుకు వలయు సన్నాహములు జరపుము. అందుకై నీ వేమియు వస్తువులు తీసికొని రా నక్కఱలేదు. రాధాకృష్ణునితోను, మహాదేవయ్యరుతోను, చెప్పి పారము వగైరాలు ఫిలప్పు చేయించుము' అని శయ్య వీడి లోని కరిగిరి.

నే నడిగినదాని ననుగ్రహించిన ట్లుత్తర మీయక యర్థింపవలసినదే అయిన ను అప్పు డర్థింపపని ననుగ్రహించుట జరిగెను గదా యని వింత చెందుచు నేనును వెలికి వచ్చి కాలకృత్యములు నిర్వర్తించుకొని, యంతలోనే యోగశాలకు విచ్చేసిన మిత్రు లిర్వురకు శ్రీవారి యాజ్ఞను దెలిపితిని. వారు నవ్విరి. ఎనిమిది గంటలకు సర్వము సిద్ధమయ్యెను. నాఁడు శ్రీవారియింట వారి మేనత్తగారు, వృద్ధురాలు చాల జబ్బుపడిరి. వారి యారోగ్యమును గూర్చి శ్రీవారు తీవ్ర ప్రజ్ఞతో నుండిరి. ఎనిమిదిగంటలకు ఇన్‌సియేషన్ జరగినది.

మాతృశ్రీగారు యోగసాధనోపక్రమమునకు ముందు ఇడ్డెనలు, కాఫీ, ఆహారము తీసికొనుటకై తెచ్చి దగ్గఱ నుంచిరి. అది తెలియక యాక్రొత్తయువిద యభ్యాసవిధానము నారంభించెను. అయిదునిమిషములలో శరీర మెల్ల కొయ్యబాఱి కదల మెదల వీలులేకుండ బిగిసికొని పోయెను. దగ్గఱకు వచ్చి సచ్చిదానంద స్వాములవా రాస్థితిని జూచి పిలిచిరి. తెఱవఁజాల దయ్యెను వారు మాతృశ్రీగారిని బిలుచుకొని వచ్చిరి. చూడఁగా నాహారపదార్థము లుంచినవి యుంచినట్లే యుండెను. వెంటనే లేపి, ఒడలు పిసికి, మెలుక తెచ్చి యాహారము గొనిపించిరి. మూఁడునాలిడ్డెనలు, చెంబెడు మంచినీరు, కాఫీ త్రాగి, శక్తి రాఁగా మరల యోగసాధనముల సాగింపించిరి. పావుగంటసేపు ప్రబలముగా సాధన జరిగెను. అంతతీవ్రముగా నాఁ డుండుటకు కారణము శ్రీవారి యానాఁటి ప్రజ్ఞాతీవ్రతయే యగుట నక్కడి వారు తెల్పిరి; నాఁడు మహోత్సాహముతో దంపతుల ముంటిమి.

ఆ సాయంకాలమే నేను మద్రాసు వెళ్ళవలెను. నా కోర్కె తీరలేదు. మరల శ్రీవారిని దర్శించి నా కోర్కె— మాతలిదండ్రుల విషయమును ప్రశ్నించి తిని. శ్రీవారు నా యజ్ఞానమున కత్యప్తి గొన్నట్టుండి యిట్లనిరి. ఒక వారి శరీర ములను జిరకాలము రక్షింప ననువు పడదు. అయినను నీవు వెంటాడు చున్నావు గాన చెప్పుచున్నాను. నీవు యోగసిద్ధుఁడ వై తేని— 'దశపూర్వేషాం దశాపరేషాం'- మీ వంశ్యులకు నీయోగ వాసన లంటి వారు కడతేరఁగలరు. పదిసంవత్సరములు విడువక నాయాదేశముచొప్పున యోగాభ్యాసము చేయవలెను. అన్ని వాంఛితములను నీవే నెఱవేర్చుకొనఁ గల్గుదువు. ఇప్పటికి మీతల్లిదండ్రు లక్కడనే ఉండి యీనా యుపదేశించు విధానము నాచరింతురుగాక' అని తద్విధానము తెల్పిరి. నేనెంతో ఉప్పొంగితిని.

కాని యానాఁడు తెలతెలవాఱునపుడు వారిని దర్శించి నప్పడు భాషించిన తెలుఁగునకు, నే నొక్కదాని నడుగఁగా దానికి బదులు ననుగ్రహింపక యన న్వితముగా జరపిన సందర్భమునకు, మధ్యాహ్నము మరల వెంటాడి మూర్ఖతతో ప్రశ్నింపఁగా చూచినచూడ్కికి, చెప్పినబదులుకు నేకాన్వయమును మఱి పదేండ్లకు గాని నేను గుర్తింప యోగ్యత గల వాఁడ గాఁజాల నయితిని. పదుమూఁడేండ్ల కద్భుతముగా తద్రహస్య మెల్ల ననుభూతి పూర్వకముగా గోచరించెను. అది యాసందర్భము వచ్చినప్పుడు వివరింపఁగలను.

కుంభకోణముననుండియే మాతల్లిదండ్రులకు శ్రీవారి యాదేశమును వ్రాసి తిని. శ్రీవారిసన్నిధిని మాదంపతుల కెట్టి యనుభూతులు జరగినవో సుదూర దేశమున నున్నను మా తల్లిదండ్రులకు నట్టియనుభూతులు జరగినవి. తర్వాత వారు మద్రాసుకు నా కాయావిషయముల తెలిపిరి. నాఁడు రాత్రి మెయిలులో దంపతులము మేము మద్రాసు వచ్చి వేసితిమి.

## నాడీగ్రంథములు

తంజావూరిలో పరిశీలించిన గ్రంథముల విషయమున జరపవలసిన తర్వాతి కార్యములను జరపుటకు మద్రాసులో మేము గొంత పని చేయవలసి యుండుటచే మూఁడు నాల్గు నెలలు మేము మద్రాసులోనే యుంటిమి. అప్పుడు

మద్రాసు గవర్నరుగా పెంట్లండు దొరగా రుండిరి. ఆయన నెవరో ఇంగ్లండు వారో, జర్మనీవారో ప్రేరేచి రంట! 'తంజావూరి లైబ్రరీని మాకుఁ గొనిపెట్ట వలసిన' దని. అందుకై ఆ లైబ్రరి విలువ కట్టుటకు గ్రంథముల పరిశీలనము జరుపవలసెను. మమ్మందుకు తంజావూరు పంపిరి.

ఈ రహస్యము పైకి పొక్కినది. ప్రజలు గందరగోళము చేసిరి. గవర్నరుగారు తమ తంత్రము కట్టిపెట్టిరి. ఒక విధముగా మేమక్కడికి వెళ్ళి జరపిన పరిశీలనము వ్యర్థమయినది. కాని యానాఁడు మేము వ్రాసిన విమర్శములు కొన్ని యటుతర్వాత తంజావూరి కేటలాగులు ప్రకటించువా రుపయోగించు కొనిరి. మేమువిలువ కట్టుటకే వలయు నంశములను ప్రధానముగా గూర్చితిమి. కాని గ్రంథాంశ పర్యాలోచనకుఁ గాదు. కాన మా లిస్టులలో ఆయావిషయములు పర్యాప్తముగా సేకరింపలేదు గాని పుస్తకముల నన్నింటిని సరిగా గుర్తించితిమి. గణించితిమి. గవర్నరుగారిపని వ్యర్థమయిన తర్వాత మా లిస్టుల నన్నింటిని తంజావూరి లైబ్రరి కిచ్చివేసితిమి. ఆ లెక్కకట్టుపనిలో నేను మద్రాసులో నుండి ఆరోగ్యవిషయమున, గ్రంథపరిశీలన విషయమున, యోగ సాధన విషయమునఁ జాల నభ్యుదయము చెందితిని. ప్రతి దినము నేను మిత్రులతోఁ గలసి యోగాభ్యాసము చేయుచుంటిని.

ఆ నాళ్ళలో ధ్రువనాడీ పరిశోధన మధికముగా జరగెను. అందు శ్రీవారి జాతకము పరిశీలించుట జరగెను. ఇంక ననేక మిత్రుల జాతకముల పరిశీలనము జరగెను. ఆ యుత్సాహమున నా జాతకమును బరిశీలింపించుకొంటిని. ధ్రువనాడి సత్యాచార్య ప్రణీత మని యం దున్నది. సత్యాచార్యుఁడు పంచసిద్ధాంతికాది గ్రంథకర్త యనియు, క్రీ. 4వ శతాబ్దివాఁ డనియు ప్రసిద్ధిగన్నవాఁడు. ఆతఁడే యేతద్గ్రంథ కర్తయని కలదు గాని యిందలి భాషాశైలీ లక్షణాదులను జూడఁగా నది సత్య మనిపించదు.

ఈ నాడీగ్రంథములు సంస్కృత ద్రవిడ భాషలలో నరవదేశముననే యధికముగాఁ గలవు. ఆంధ్రదేశమునఁ గూడ నాంధ్రభాషలో వేములవాడ భీమన రచితముగా నొక నాడీ గ్రంథ మున్నది. కాని యది సీసమాలికగా వేములవాడ

భీమకవి రచనమని విశ్వసింపఁ దగనిదిగానేయున్నది. దానిని ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు నేనే సేకరించితిని. అది ప్రస్తుతకాలమున నుపయోగపడినది కాదు. ఇక సంస్కృత ద్రవిడ గ్రంథములలో ధ్రువనాడి యని, సత్య సంహిత యని, శుక్రనాడియని, చంద్రకళానాడి యని, నాల్గు గ్రంథముల నే నెఱుఁగుదును. అవి యెవరో ప్రాచీన మహర్షులు, తత్కల్పులు రచించినవిగా నున్నవి. ధ్రువనాడీ సత్యసంహితలు సత్యాచార్య రచన లనఁగా నే నే మనుకొంటి ననఁగా సత్యాచార్యుని యంశమున నిటీవల జనించినవా రెవరో పూర్వాను స్మృతి కలిగి వానిని రచించి యుందురని.

ఇక్కడ వక్తవ్యము చాలఁ గలదు. ఈతఁడు శివాంశమున జనించినాఁడనీ (అప్పయ్య దీక్షితాదులు), ఈతఁడు గుడిగంట యంశమున జన్మించి (వేదాంత దేశికులు ) నాఁడనీ యిత్యాది విధములఁ బలువురను ప్రాచీన మహనీయులను గూర్చి ప్రామాణికులే నిర్ణయించి పలుకుచుండుట కలదు. ఆయా దేవతల ఖండావతారములుగా వారిని నిర్ణయించుట సంగతము. ఆయా మహా మహులు లోకమున నేవేవో యపూర్వాద్భుతార్థములను వెలయించుటకై యవతరించుట కలదు. దేశకాలాదుల యసౌకర్యముబట్టి యాయా కార్యములను వారప్పుడప్పుడే యా యా యవతారములలోనే నిర్వర్తింప వీలుపడకపోవచ్చును. శుద్ధసంకల్పులు గనుక వారు వా రాయా కార్యములను గొన్ని జన్మముల నెత్తి నిర్వర్తింపవలసిన వా రగుచుందురు. శంకర, జిన, బుద్ధాదుల కార్యము లట్లే యొక జన్మమున నిర్వాహము చెందవయ్యెను

అతి ప్రాచీనులయి జ్యోతిషమున నద్భుతగ్రంథములు రచించిన సత్యాచార్యాదులు మరల మరల జన్మించుచు లోకవృత్తమును గొన్ని కొన్ని షష్టులకు రచించుచు వచ్చుచుండిరని నా విశ్వాసము. తర్వాతి తర్వాతి జన్మముల వారి గ్రంథములకే నాడీగ్రంథము లని పేరు. అవి కొన్ని కొన్ని షష్టులకే రచితము లయి యుండు ననియు నా విశ్వాసము. వారు వా రాయా జన్మములలో జ్యోతిష ప్రజ్ఞకే పారమార్థ్యము గల్పించుకొనుటచే భాషాపాండిత్యమునకై యంతగా ప్రాకులాడ రయిరి. వారి గ్రంథములలోని భాష నిర్దుష్టముగాదు. ప్రౌఢమునుగాదు. కొన్నిచోట్ల కొందఱ కొందఱ గ్రంథభాగములు ప్రౌఢములుగా లేకపోలేదు. రుచి గల, యర్థవిశేషములు గల జాతక భాగములఁ జెప్పుచో శ్లేషాద్యలంకారములతో

నతి రసవంతమగు భాషతో నాయా గ్రంథభాగము లున్నవి. అందు శబ్దజాలము క్రొత్తగా నేఁడు పుట్టుచున్నను మనుష్యులనుగూర్చి వారి వర్తనముల గూర్చి పేళ్ళగూర్చి కూడ నుండును. ఈనాఁడు క్రొత్తవెలసిన, వెలయుచున్న రేడియో, రేడియం, ఎక్సురే, కాస్మిక్‌రే, ఆటంబాంబు మొదలగువానిని గూర్చి కూడ నం దుండును.

తద్గ్రంథకర్తల నాఁటి కీ విషయములు భవిష్యద్విషయములే యయినను నా గ్రంథములలో నాయా భాగములఁ జదివి వెల్లడించి నంతవఱకు భూతమును, దరువాతిది భవిష్యత్తును నగుట గానవచ్చును. ఆయా గ్రంథములు చదివిన నాఁటిదాఁక విషయములు జాతకునకు చక్కగా సరిపడునవి గానంతదాఁక తు.చ. తప్పకుండ జరగినవిగా నుండుటచే దానిని బట్టి తర్వాతి గ్రంథభాగమును విశ్వసించి జాతకుఁడు గయికొనును. తర్వాత నది తప్పిపో నారంభించును. క్రమముగా నన్ని విషయములు విస్పష్టముగాఁ దప్పిపోవు చుండును. ధ్రువనాడిలో నట్లు జాతకము తప్పిపోవునట్లు గుర్తించి యడుగఁగా నపుడు సరిపోయినవిగా నింకొక తాటియాకు దొరకును. అది పూర్వపుటాకు కంటె కొంత హెచ్చుభాగములు సరిపోయినదిగా నుండును. కొన్నాళ్ళ కిదియు తప్పిపోవును. ఇట్లు ఆనాడి, తత్పాఠకుఁడు, జాతకుఁడు ఉన్నంతదాఁక చదువుచునే యున్నచో జాతకము సరిదిద్దుకొనుచునే యుండవచ్చును. కాని రే పిట్లు జరగ, గల దని సునిశ్చితముగా నే నాడి గ్రంథము గాని చెప్పుట నే నెఱుఁగను. ప్రత్యుత తద్విరుద్ధముగా జరగుటయు నెఱుఁగుదును.

పర్యాలోచించి చూడఁగా నొక్కొకప్పుడా గ్రంథమాయావేళల కనుకూల ముగా నిర్మిత మగుచుండు నేమో యని తోఁచును. ధ్రువనాడిలో జాతకము తప్పి నపు డెల్ల క్రొత్త జాతకము దొరకుచుండుట యిట్టిదే. కాన యా నాడి నుప యోగించు గ్రంథస్వామి దానిని సృష్టించుచుండెనని కొంద అందురు. నాడి తప్పి నప్పు డెల్లఁ దద్గ్రంథస్వామిని కొందఱు తస్కరుఁడు, తప్పుడు సృష్టి చేసె నని నిందించుచుందురు. దానిని జదివినందు కాతఁడు కొంత సొమ్ము గయికొను చున్నాఁడు గాన యక్రమముగాఁ నాతఁ డా నిందకు బాల్పడవలసి వచ్చుచుండును. అంతేకాని నిజముగా నా గ్రంథస్వామి దానిని సృష్టింపఁజాలఁడగుట నేను బాగముగా

నెఱుఁగుదును. ఆతని దృష్టి కా యక్షరములట్లు కానవచ్చెనని కాని యాతని తల కట్లు శ్లోకపరంపర తోఁచె నని కాని వాకొనుట యుక్తము.

ధువనాడీ స్వామి యగు శేషాచార్యుని విషయమున నీ యర్థము యథార్థము. అస్మదాదుల మనేకుల మా గ్రంథమున నుండి యా నాఁడు జాతకముల వ్రాయించుకొంటిమి. అబ్బురము చెందుచు మిత్రు లనేకులకు జాతకములు వ్రాయించితిమి. వ్రాయు నప్పుడు విడువకుండ సన్నిధినే యుంటిమి. ఇంత యేల? అస్మదాచార్యపాదుల జాతకము నందుండి పఠించునపుడు, వ్రాయించునపుడును నేను సన్నిధనే యుంటిని. ఇంకను గొందఱు మిత్రు లుండిరి. ఆ గ్రంథము గల శేషాచార్యుఁడు శ్రీవారియెడ నప్పు డద్భుతభక్తి గల శిష్యుఁడు. వారి జాతకము నంతవఱకు నక్షరాక్షరము సత్యముగా నుండెను.

అందులో నాకు విడ్డూరము గొల్పిన విషయములు గొన్ని యున్నవి.

"బ్రహ్మస్వరూపో భగవాన్ దర్శనం చ క్వచిత్ క్వచిత్
అదర్శనం క్వచిచ్చేతి తత శ్చంచలబుద్ధిమాన్"

అని నల్వదవయేటి వృత్తాంతము వర్ణిత మయియుండెను. ఇది చదువుచో నేను దగ్గఱ నుంటిని. ప్రతి పదము ప్రామాణిక మగునో కాదో యని శ్రీవారు పరీక్షించుచుండిరి. ఈ శ్లోకము చదువునపుడు కొంత యాగి యోచించి నవ్వి 'సరిగా వ్రాసుచ్చినాఁడు. మీఁద చదువుండు' అనిరి.

అప్పు డీ శ్లోకమున కర్థ మేమో బ్రహ్మదర్శనము లభించుట యనఁగా నెట్టిదో, అప్పుడేమి జరగినదో వివరించి తెలుప వేఁడెద నని పలుక నాలుక చివరి దాఁక ప్రశ్నము సాగును గాని నాలుక దాఁటి బైటికి రాదయ్యెను. ప్రశ్నింపవలె నని చాల తంటాలు పడితిని గాని ప్రశ్నింప నాచేతఁగా లేదు. 'జీర్ణ మంగే సుభాషితమ్' అన్నట్టుగా నీ ప్రశ్నార్థము నాలోనే నిలిచి పోయినది గాని పయికి రానే లేదు. నే నీ యోగమార్గమున చేరిన పదియేండ్లకు అనఁగా 1926–వ సంవత్సరమున నా యనుభవమున నొక యద్భుతానందమయ విషయము జరగెను. దాని

నెఱుఁగుదు నంతే కాని 1936 దాఁక అనఁగా మఱి పదియేండ్లదాఁకఁ గాని దాని, వివరణ మెల్ల తెలియరాదయ్యెను. దాని నాయా సందర్భము లందు వివరింతును.

ఈ నాడీగ్రంథము లాయా జాతకుల హృదయములలో దాగి యుండిన రహస్యార్థములఁ గూడఁ గొన్ని కొన్ని పట్టులం దద్భుతముగా వివరించుట కలదు. అవి నాడీరచయితకును, జాతకునకునే తెలియవలెను గాని గ్రంథపాఠకుఁ డగు నాడీస్వామికిఁ గూడ తెలియవు. ధ్రువనాడిలో నిట్టి వానిని గొన్నింటిని బేర్కొందును.

'జలగండ మవాప్నోతి మృతప్రాయోపజీవనః' అని నా జాతకమునఁ గలదు. నేను మఱచితిని గాని యది జరగిన విషయమే! మా దొడ్డిలో పిల్లలము కొందఱ మాడుకొనుచుంటిమి. నూతిలో వెదురుగడలు దింపి వానిని బట్టుకొని పైకి లాగుచుంటిమి. నేను వేసినగడ నీటిలో అడుగున బురదలో లోనికిఁ జొచ్చుకొన్నది. దానిపై యంచు ఒరమీఁద నున్న నా కందకుండెను. లోనికి తలవాంచి యెట్లే నందుకొన జూచుచుంటిని. ప్రక్క పిల్లవాఁడు నా ముడ్డి పైకెత్తెను. నేను నూతిలోఁ బడిపోయితిని. పిల్ల లందఱు పటాపంచలై పాఱిపోయిరి. మా నాయనగారు లేరు. మా యమ్మగారు నింటిలో నేదో పని చేసికొనుచుండిరి. నూతిలో పెద్దధ్వని గలుగుట ప్రక్కయింటి యాతఁ డాలకించి దొడ్డిలోనికి వచ్చి చూడఁగా పిల్ల లందఱు పారిపోవుచుండిరి. ఒక పిల్లవానిఁ బట్టుకొని గట్టిగా నడుగఁగా నేను నూతిలోఁ బడుట చెప్పెను. ఆతఁడు పర్వెత్తుకొని వచ్చి చూచుతరికి నాల్గు మూఁడు నిమిషము లాయెను. నే నొక మునుక వేసి తేలి నూతిలో నూగిసలాడుచున్న గడను పట్టుకొని మరల మునుక వేయక తేలియుంటిని. ఆతఁ డొరల మీఁదుగా దిగివచ్చి నన్నుఁ బట్టుకొని మా యమ్మగారి కప్పజెప్పెను. ఈ విషయ మా నాడిలో నున్నది.

అట్లే పందొమ్మిదవయేట ఆవనిగడ్డదగ్గఱ బండి యేటిలోనికి దిగుచుండఁగా బోల్తా కొట్టి చచ్చి బ్రదికితిని. "వాహనా త్పతనం చైవ తన్మూలాచ్చ మహద్విపత్" అని యందు కలదు. ఇట్టివి ప్రతి జాతకములోను వింత వింతలుగా నుండుట నే నెఱుఁగుదును.

నే నెఱిఁగిన మఱొక గొప్పవింత. మద్రాసులో నొకా నొక గొప్పయింట నొక పిల్లవాని కేదో కడుపులో తీవ్రమయిన యనారోగ్యము. అది కుదుర్పరానిది. బ్రదికిన నొక వేళ శస్త్రచికిత్సతో బ్రదుకవచ్చు నని యాస. ఆ కుఱ్ఱవాఁడు జీవించునో లేదో గుర్తించుటకు ధ్రువనాడీకారున కత్యధికధన మిచ్చి యింటికి రప్పించి గ్రంథము నక్కడే యుంచి చదివించుచుండిరి. ఆ కుఱ్ఱవాని జాతకము సరిగానే యుండుఁ గలదు. అతని యనారోగ్యపు నిర్వచన మెల్ల సరిగానే యుండుఁ గలదు. ఆ జాతకపుటాకు తూచిపట్టి చదువుచుండిరి. అంతలో ఆపరేషను చేయుటకు డాక్టరు రంగాచార్యులుగారు విచ్చేసిరి. ఆ సమయమునకు సరిగా 'శస్త్ర వైద్యేన జీవతి' యన్న వాక్యము నాడిలో వచ్చెను. తరువాతి యాకు నింక చదువ వలెను. డాక్టరుగారు వచ్చుటచే నంతట నాపిరి. అందఱకును ఆ కుఱ్ఱవాఁడు శస్త్రవైద్యముచే జీవించును అనియే యర్థము స్ఫురించెను. డాక్టరు శస్త్రోపక్రమమునకు సిద్ధపడుచుండెను. నాడీగ్రంథమునఁ జదువుచున్న పట్టున గుర్తించి కట్టిపెట్టి గృహస్వామి యినుప పెట్టెలో తాళము వేసి తాళముచెవి నాడికారున కిచ్చెను. మర్నాడు వచ్చి కడమ గ్రంథమును జదువుట కేర్పాటు జరగెను. తొందరగా నాడీకారుఁడు శేషాచార్యుఁడింటికి వచ్చి పేసెను. ఈ విషయ మెల్ల మాతోను జెప్పెను. మేమును నొతఁడు జీవించు ననియే యనుకొంటిమి.

మర్నాడు శేషాచార్యుఁ డుదయమున వారింటికి వెళ్ళెను. ఆపరేషను జరగుచుండఁగానే ఆ బాలుఁడు మృతుఁడౌట తెలియవచ్చెను. అక్కడి పండితులు నివ్వెఱ చెందుచుండిరి. ఈతనిని నాడి తెఱవు మనిరి. తెఱవఁగా నా జాతకమున తుదిశ్లోక మదియే. తర్వాతి యాకులో వేఱొక జాతక ముపక్రాంత మయ్యెను. పర్యాలోచింపఁగా — శస్త్రవైద్యే = శస్త్రవైద్యమున (వైద్యము జరగు కాలమున) నజీవతి = చనిపోవును అని యర్థమగుట, అట్టగుటచేతనే జాతకపుఁ బైభాగము లేకుండుట తెలియ నయ్యెను. అందఱును దైవవంచనకు ఖిన్ను లయిరి. ఇట్టి వానిని ధ్రువనాడీ చమత్కారముల నెన్నింటినేని పేర్కొన నెఱుఁగుదును.

అందు సి. వి. వి. యోగమార్గమునఁ జేరినవారి జాతకములు పదుల కొలఁదిగాఁ జదువుట నే నెఱుఁగుదును. ఆ చదువుట నా సమక్షముననే జరగినది. శ్రీవారి జాతకమునఁ గల విషయముతో యనేకుల జాతకములం దున్నవి. శ్రీవారి జాతకమును, శిష్యులయు తదితరులయు జాతకములును గొన్నా ళ్ళయినతర్వాతఁ

దప్పిపోవుటయు, మరలఁ జూడఁగా సరియయినవి దొరకుటయుఁ గూడ నెఱుఁగుదును. శ్రీవా రుండఁగా నా నాడీగ్రంథమును శ్రీ వేపా రామేశము గారి దగ్గఱ గొన్ని వందలరూప్యములకుఁ దాకట్టు పెట్టుటయు వారు దానికి ఇండెక్సు వ్రాయించుటయు జరగినది. ఆ నాళ్ళలోఁ గ్రొత్తగా జాతకములు చదువుట సాగలేదు. మఱియు నాతఁడా నాడీగ్రంథమును జదువుచుండిన నాళ్లలో వెల్లడియయిన జాతకము లనేకము లీ యిండెక్సు చేసిన గ్రంథములలోఁగానరాలేదు. వాని నాతఁడు దాఁచియుంచు కొనెనో, చదువునాళ్ళలోనే కల్పించి చదివెనో యని కొందఱు సంశయించిరి. నా నిశ్చయ మాతఁడు కల్పింపనుగాని, దాని యుంచుకొనను గాని నేరనివాఁడే యని.

## భుజండనాడి

శ్రీవారుండగానే, ధ్రువనాడి చదువుచుండు నాళ్ళలోనే యీ నాడి బయల్పడెను. ఈ నాడి గల యాతఁడు కుంభకోణ వాస్తవ్యుఁడే. పట్టునూలిజాతివాఁడు. వలసినంత ధనము గొని తొలుత శ్రీవారి జాతకము చదివెను. అది చదువునాఁటి కాతనికి తద్గ్రంథవిధానము స్పష్టముగా నెఱుఁగరాకే యుండె నఁట! శ్రీవారి జాతకము చదువుటలో నా ప్రజ్ఞ యేర్పడె నఁట! ఆ జాతకము చదువుటవల్ల నాతనికి శ్రీవారియెడ భక్తి ప్రపత్తు లేర్పడెను. శిష్యుఁడయ్యెను. అన్వహము శ్రీవారిదో, శిష్యులవో, ఇతరులవో జాతకములు చదువుట, దానివలని యా యటితో జీవితము గడపుట యాతని కేర్పడెను. ప్రధానముగా శ్రీవారియు, వారి కుటుంబము వారియు శిష్యులయు, వారి కుటుంబముల వారియు జాతకములు చదువుటలో నాతనికి తీరిక లేకుండెను.

కొలఁది దినములలో శ్రీవారు శరీరమును విడుతురనఁగా నాతని ప్రశ్నించిరి. 'ఉన్నది యున్నట్టే వ్రాయుట, చదువుట జరుపుచున్నావా? కల్పనలు సాగించుచున్నావా?' అని. ఆనాఁడే ఆతఁడొక కల్పనము చేసె నఁట! శ్రీవారి ముఖ్యశిష్యులలో 'అంబష్ఠుఁ' డొకఁ డుండెను అనుటకు 'అమ్మట నొరువన్' అని యుండగా నాడి కాపి వ్రాయుచున్న వాఁడు గోపీనాథరావను శ్రీవారి శిష్యుఁడే నాడికారుని వంటి వాఁడే వాక్సహాయము చేయఁగా 'పండితనొరువన్' అని మార్చి వ్రాసె నఁట! దక్షిణదేశమున 'అంబష్ఠుని' పండితుఁ డనుట పరిపాటి - గడగడలాడుచు దీని నాతఁడు శ్రీవారికి నివేదించెను. ఎప్పుడుగాని యిట్లు మార్పవలదని శ్రీవారు

శాసించిరి. కడకు శిష్యగోష్ఠిలో నీ విషయమును దెలిపి ఇదివఱకు వ్రాసిన భాగమున నిం కేమేని మార్పులు చేసినాఁడేమో పరిశీలింపవలసియున్నది యని దాని కాపి లెవరెవరు వ్రాసిరో, వారి వారి కాపీలతో నందఱను, మూలముతో నాడి కారుని రమ్మనిరి. ఎవ్వరు నేమి కల్పనము జరపిరో యెఱుఁగరు గాన తమ నిర్దుష్టతను నిరూపించుకొనుట కందఱు వచ్చిన తర్వాత మూలమును, కాపిలను వశపఱచుకొని కట్టకట్టి యట్టుకమీఁద దాచి వైచిరి. ఇకనాడి చదువవల దనిరి.

"వ్రాయసగాఁ డేమేని మార్పు చేయవచ్చును. మాతృక వ్రాసినవాఁడే యెఱుక చాలక యేమేని తప్పు వ్రాసియుండవచ్చును. గ్రంథకారుఁడే యజ్ఞుఁడై తప్పిదపు రచనము చేసియుండవచ్చును. దానికి పరమప్రామాణ్యము కల్పించుకొని మీరు చదువరాదు. నాదగ్గఱకు మీరు వచ్చి శిష్యులగుట నాడిమూలమునఁ గాదు. నాడిఁ జూచుట మీరు నా శిష్యులయినతర్వాతనే. ఏ కారణములతో మీరు నా శిష్యులయితిరో ఆ కారణములతోనే నన్ననువర్తింపుఁడు. నా మాటలు స్వతః ప్రమాణములు గాని పరతః ప్రమాణములుగావు. నన్ను, నా కార్యములను నాడి ననుసరించి విశ్వసింపవలదు" అనిరి.

అక్కడ నున్న శిష్యులు కొందఱు 'మీయాదేశముల ననువదించుట చేతనే నాడిని విశ్వసించుచుంటిమి. తద్విరుద్ధముగా నుండునేని యప్పుడే విడనాడి యుందుము' అనిరి. 'సరే! సనసన్నగా ననువర్తించుచున్నట్టే యుండి యీనాడి కాలాంతరమున నజ్ఞానముచే తప్పులుచెప్పుట సాగింపవచ్చును. అందాఁకప్రామాణ్యముంచిన గ్రంథముపై అప్పుడప్రామాణ్యము కల్పించుట మీకు సంగతముగాఁ దోఁపక పోవచ్చును. నా యోగమార్గమును బరిపూర్ణముగా గుర్తించుట యెవ్వరికిని సాధ్యము గాదు. అది నాకుఁ గూడ నప్పటప్పట దెలియనగు నదిగా నుండును. శాఖోపశాఖలుగాఁ బెరుగఁగల మఱ్ఱిచెట్టునకు ఎన్నాళ్ళ కేదిక్కున నేశాఖ నది వెలయింపఁగలదో తెలియనట్టే లోకతంత్రమున, మఱీ యీ యోగతంత్రమున వికాస ముండును. మానవుఁడు ఈశ్వరతను జేర బోవు కొలఁదిని దానిని దెలియఁ గల్గవచ్చును వృక్షశాస్త్రమునఁ గొన్ని వృక్షము లెన్నాళ్ళ కెన్ని యాకులనో, శాఖలనో వెలయింప గల వనీ, యీ యీ సమయములలో బుష్పింపఁ గలవనీ, ఫలింపఁగలవనీ, ఇన్ని పుష్పము లనీ, యిన్ని ఫలము లనీ కూడ గుర్తించుట జరగుచున్నది. మానవప్రజ్ఞ పెరుగను పెరుగను ఈశ్వరునకుఁ జేరువ కాసుగాను

సర్వప్రాణి సృష్టిరహస్యములను మానవుఁడు గుర్తింపగల్గవచ్చును. మానవత పెరుగను పెరగను తద్హృదముననుండి ప్రజ్ఞోద్భోధములు పెరుగఁగలవు. ఇప్పుడు పెంపొందుచున్న శాస్త్రము లన్నియు నట్టివే.

మానవహృదయము నిర్దుష్టము కానంతవఱకు, మానవ వాక్కు సుపవిత్రము కానంతవఱకు, మానవ కార్యములు వినిర్మలములు కానంతవఱకు సృష్టిరహస్యము మానవతగుర్తున కందనేరదు. ప్రయత్నములు సాగుచున్నవి. ఈనాడీ గ్రంథము లట్టిప్రయత్నమున పుట్టినవే.

"విహాయ శాస్త్రజాలాని య త్సత్యం త దుపాస్యతామ్
వేదశాస్త్రపురాణాని పదపాంసు మివ త్యజేత్"

అని చెప్పినవా రిట్టిభావము గలవారే. మీ రీనాడీ గ్రంథాదుల వెంటాడుట సాగించితి రేని మీలోని ప్రజ్ఞోద్బోధములు కుంటువడును. ప్రజ్ఞోద్బోధముల వెంటాడుచు బాహ్యశాస్త్రాది సాధనములను విడనాడవలెను. కడకు ఆత్మాను భూతిలో నెలకొనుట యగును. మీరు చూడవలసినది యీ తాటాకులనాడి గాదు. శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడి. ఈ తాటాకుల నిప్పటి కిఁకఁ గట్టిపెట్టి ఇందు చూపు తత్పరతను యోగసాధనములమీఁద చూపుఁడు" అనిరి.

ఇట్లు జరగిన కొన్నినాళ్ళకు ముఖ్యశిష్యుఁ డొకఁడు 'నాడిలో నేమి విశేషము లున్నవో చదివి చూడ ననేకు లుత్సాహపడుచున్నారు. చదువ ననుగ్రహింప వేఁడుచున్నాను' అని వేఁడఁగా శ్రీవారు "ఆనాడి కొన్ని ముఖ్య విషయములను వెల్లడింపఁగలదు. అది చదువుటకు సమయమున్నది. అప్పుడు దానిని చదువుదురు గాని" యని బదులు చెప్పిరఁట' అంతకుఁ బూర్వమే శ్రీవారి జాతకమునఁ గొంత భాగము చదువుటయ్యెను. ఇతరుల జాతకములలోను గొన్ని భాగములు చదువు టయ్యెను. ఆ కాలమున నేనును నాజాతకపుఁ బీఠికాభాగమును జదివించుకొంటిని. ధ్రువనాడిని, భుజండనాడి యవతరణికాభాగమును, విజయనగరపుఁ బక్షి శాస్త్ర శ్లోకములను, శ్రీవారినిగూర్చి నేను వ్రాసియుంచుకొన్న పద్యములను వ్రాసిపెట్టు కొన్న వ్రాఁతప్రతిని, ఇటాలియన్ నోటుబుక్కును ఎవ్వరో హరించిరి. అది

నాదగ్గఱ నిపుడు లేదు ఉన్నచో నాయాశ్లోకములను, అరవ పద్యములను, తెలుఁగుపద్యములను, చాల వింతవిషయములు గల వాని నిక్కడ నుదాహరించి యుందును.

---

సీ. వీ. వీ కరుణాకటాక్షములు రక్షించుఁ సదా తన్మయం
బై వర్తిల్లెడుభక్తి యున్న యెడ నిత్యానంద మారోగ్య మా
హాపుట్టించెడుప్రజ్ఞ యాత్రయము లభ్యంబౌను తార్క్షణ నే
నే! వేయేటికి? మీర లిందఱును దీనిం జక్క గుర్తింపరో!

---

సం॥ వే. ప్రభాకరశాస్త్రి

# ప్రజ్ఞాప్రభాకరమునుగూర్చి

"శరీరమనే బ్రహ్మాండాన్ని పరిశోధించగా తేలిన పరమార్థమే ఈశ్వరుడు. ప్రపంచంలోని ఆనందాల చరమానందమే ఈశ్వరుడు. విశాల విశ్వాన్ని సంగ్రహించుకొని కుంచించుకొని పోగా మిగిలే పాయింటే-చరమాణవే-ఈశ్వరుడు".

అని పితృపాదులు శ్రీ ప్రభాకరులు తిరుపతిలో 1949, మే నెల 29 వ తేదీన జరిగిన పురప్రముఖుల సమావేశంలో ఉపదేశగర్భితమూ ఆత్మకథాత్మకమూ అయిన "ప్రజ్ఞాప్రభాకరము'' అనే గ్రంథానికి ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్ఘాటించారు.

ఆ సందర్భంలో తాము పొందిన యోగానుభూతిని గూర్చి వారు చేసిన ప్రసంగాని కిది సంగ్రహ రూపము. (చూ. ఆంధ్రప్రభ - దినపత్రిక, 1949 జూన్ 3 శుక్రవారం)

"నా 25వ ఏట భయంకర వ్యాధిగ్రస్తుడనైనాను. ఏ మందులకు మాకులకు ఆ వ్యాధి కుదరలేదు. తుదకు అప్పటి ప్రెసిడెన్సీ కాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసరు శ్రీ పోతరాజు నరసింహంగారి ద్వారా కుంభకోణంలో వున్న శ్రీ సి. వి. వెంకాసామిరావుగారనే మహా మహుని 'ట్రీట్‌మెంట్' ద్వారా ఆరోగ్యాన్ని పొందాను. అప్పటి నుంచి ఆ మార్గమే ఉత్తమమైనదని విశ్వాసం కలిగింది. శరీరమనే పుస్తకాన్ని చదివే తీరును వారి నుంచే నేను ఉపదేశం పొందాను. అంతర్ముఖులమై ఈ శరీరమనే పుస్తకాన్ని అధ్యయనంచేస్తే మన ప్రజ్ఞ ఒక చోటుకు మోదుకొంటుంది. అదే కుండలిని. జడ కోలాటపు దారాలన్నీ ఒకే కేంద్రంనుంచి పాయలు పాయలుగా క్రిందికి వెళ్లుతున్నట్లుండే దేహంలోని శాఖోపశాఖలకు కేంద్రం

